* శ్రీమద్గురవేనమః *

# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

మోక్షోత్పత్తి లక్షణం, మోక్షమును విడిపించే లక్షణంబును

## ఆరవ సంచిక.

—* ఇది *—

శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులచే

రచియింపబడి.

గుండా భూమయ్యగుప్త కార్యదర్శి గారిచే.

శ్రీలక్ష్మీనారాయణ ముద్రాక్షర శాలయందు ముద్రింపించి ప్రచురింపబడియె

శ్రీ మద్గురవే నమః

వేద వేదాంతాతీత ద్వైతాద్వైతరహిత పరమతత్వ మనందగు

శక్తిద్వయనిరాసకంబైన,

# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంతప్రకాశిక

మెరుకోత్పత్తి లక్షణం, మెరుకను విడిపించే లక్షణంబను

## ఆరవ సంచిక

* ఇది *

శ్రీగోలకొండయనంబరగు (దక్కన్) హయిద్రాబాద రాజధానియందు

పెద్దమహారాజగంజు నివాసులైన

## శ్రీమద్భాగవత కృష్ణదేశికప్రభువరులచే

రచియింపంబడి

సహాయకార్యదర్శుల ప్రోత్సాహముచే

రాజవర్గమువారలయొక్కయు, పోషకులయొక్కయు, అభిమానుల

యొక్కయు, చందాదారులయొక్కయు, ద్రవ్యసహాయముచే

గౌరవార్హులు, రామకృష్ణ సచ్చిదానంద సద్గురుస్వామివారి ప్రియశిష్యుండగు

## గుండా భూమయ్య గుప్తకార్యదర్శి గారిచే.

ఋ. భాలక్ష్మీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపంబడియె.

హయిద్రాబాద్ దక్కన్.

శ్రీప్రభవనామ సం॥ కార్తీక శు॥ ౧౫ బుధవారము

దీ॥ ౯ నవంబర్ ౧౯౨౭ సం॥

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.

శ్రీ గురుభ్యోనమః

శ్రీమద్భాగవత కృష్ణదేశిక విరచిత శక్తిద్వయ నిరాసకంబైన,

# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

## ( యెరుకోత్పత్తి లక్షణం )

* కందార్థము. *

* యెరుకోత్పత్తిని దెలియగ * సరసిజగర్భాదులైన * చాలరనేటిచో నరుడెంతవాఁడువాఁడది * యెరుగుదునన వట్టిమాట * లివివింతగాకా * తప్పదువాని కికరాకపోకా * అరమరలేక సద్గురుమూర్తి చరణా * పంకరుహద్వయార్చన * నెరుగానినరుమాట * లివివింతగాకా * తప్పదువాని * కికరాకపోకా ॥ ౧ ॥

(*) శ్రీశివరామ దీక్షితీయమను బృహద్వాశిష్ఠం (*)

* అచలబోధసిద్ధాంతం. *

గ॥ యిప్పుడు యదార్థం వినుండి। సంసారమంటే। మూలంలేని యీగుతేఁరిగే శరీరం యేమిచేస్తే అదేసంసారం। శరీరం లేకమునుపు। కేవలంఅచలమేన్నది। యీశరీరం యేలాగువచ్చినదంటే। ఫలానిదాంట్లవలన వచ్చిందిఅని ప్రమాణం లేదు। యీశరీరానకు మొదలుయేమీలేదు। మొదలువుంటే యిదిప్రమాణమే అవును। మూలంలేని యీగుతేఁరిగే శరీరం యెప్పుడుతోస్తే అప్పుడు వున్నది। సార్వకాలం యీశరీరంవున్నదిఅని యెరుగరు। లేదుఅని యెరుగరు। వ్యవహారం యెప్పుడు మొదలుపెడితే అప్పుడే వున్నట్టువుంచుంది। వ్యవహారం చాలించం

గానేయేమీలేదు । మళ్లా వ్యవహారం మొదలుబెడితే శిద్ధం । సార్వకాలం శరీరాన్ని విడిచిలేదు । పట్టుకొనిలేదు । తనకుతానే ఆసుగోయ్యవలె తిరుగుచుంది । తనకు స్వాధీనం లేదు । వున్నట్టే వుంచుంది । చూస్తూవుండగానే యేమీలేదు । గనక । నమ్మరాదు । నమ్మక మనము యేమిశాయగలము । అంటే । యీశరీరం మూలం లేనిది గనక । తెగిన గాలిపడిగెవలెవున్నది । మొదలు కొనా లేని యీపట్టబైలు వలె శాశ్వతమైంది కాదు । వున్నట్టే వుండి యేమీ లేదు యీశరీరం । తనకు తానే తండ్రిల అపేక్ష లేక పెద్దదిఅయి యేనుగ మీద యెక్కి । అనేక దండులోటి తనకు తానేవొచ్చి తనకుతానే కొంతసేపువుండి తానకుతానే యేమీలేదు । యీలాగే హిమాప్రకారం । తప్పున । తనవంటి స్త్రీని జూచి । తనకు తానే గుతేఱిగి । కూడితే కడుపులోనే శరీరాకారమై పుట్టేదికద్దు । యీపుటుకకు వొక్కవిధం మర్యాదా లేదు । నానాప్రకారాలు మూలం లేనిది గనక । వక్కవిధం లేదు । అనేక ప్రకారాలు । స్త్రీపురుష సంయోగంవల్లనే అని మర్యాదా లేదు । తనకు తానే పుడుచావి । తనకుతానే వుంచావి । తనకుతానే యేమీలేదు ! పుట్టించేది యేమీలేదు । శాశ్వతమైంది వక్కబట్టబైలే । యీబట్టబైలుకు రెండోబట్టబైలు లేదు । విజాతీయమైన శరీరం ఆబట్టబైలుకు లేదు । యీశరీరమందున్న భేదాలు । ఆబట్టబైలుకు లేవు ॥

* గద్య * ఇతి శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే *

( భ్రాంతిరహిత ప్రకరణం. )

## (*) భద్రాద్రి రామశతకము : (*)

( * దృష్టాంతలక్షణం. * )

సీ॥ సురలు రాక్షసులు భూసురులు వైశ్యులు శూద్రకినరులు మానులు దిగంబరులు ఋషులు
యోగులు భోగులు రోగులు త్యాగులు శౌరులు ఖేచరులు వానరులు గిరులు
రాజులు మంత్రులు రథతురగంబులు శరచాపధరులు భీకరులు కరులు
కలలోననేక మెక్కుడిచుంచివచ్చెనో గాని మేల్కొనిన నొక్కటియు లేదు

గీ॥ నీప్రపంచంబు నారీతి నేమి లేదు । బట్టబయలైన యచలమెప్పటికినుండు
రమ్యగుణధామ భద్రాద్రిరామపరను । రామనరసింహదాస సంరక్షితాంహ్వ ॥

* భావార్థము. *

* దేవతలు రాక్షసులు బ్రాహ్మణులు కోమట్లు శూద్రులు మానులు దిగంబరులు ఋషులు యోగులు భోగులు రోగులు త్యాగులు తరులు ఖేచరులు వానరులు గిరులు రాజులు మంత్రులు రథములు తురగములు; శరచాప ధరులు భీకరులు యేనుగులు యీమొదలైనవి కలలో యక్కడనుంచి వచ్చినవోగాని మేల్కొని చూచితే వొక్కటియు లేదు ఆప్రకారము యీప్రపంచము యేమీలేదు బట్టబయలైన అచల పరిపూర్ణముమాత్రము యెప్పటికి నొక్కతీరుగానుండును.

* యోగవాసిష్ఠము. *

వ॥ అనిన విని రఘూత్తముండిట్లనియె.

గీ॥ యీసృష్టియొక్కవిధమో ♦ భాసురముగజూడ బెక్కు భంగులనగునో
యీసందు తెలియ జెప్పుము ♦ భూసురకులతిలక చిత్తమునకింపెసగన్ ॥

వ॥ అనిన వసిష్ఠుండిట్లనియె.

చ॥ వొకమరి రుద్రనిర్మితము లొక్కొకవేళ్ల విరించినిర్మితం ।
బొకయెడ విష్ణునిర్మితము లొక్కొక చోమునికల్పితంబునౌ ।
నొకకడ శూన్యమైయుడుగు నొక్కొక పట్టున తానకల్గుసృ ।
ష్టికినిదియిట్లు బుట్టెనని చెప్పగరాదినవంశవల్లభా ॥

వ॥ మరియు నొక్కయెడ భూమియంతయుం దరులతాకీర్ణంబగు నొక్కకడ జనసాంద్రంబైయుండు నొక్కకాలంబున పర్వతాక్రాంతబైయుండు నందొక్కవిరించి జననంబు నెరింగించితి నింతియకాని యిదిసృష్టికిది నిశ్చయంబననారాదియర్థంబు జగన్మాయాస్వరూపంబు తేటపడజెప్పెద నాకర్ణింపుము.

* సర్వార్థసారసంగ్రహము. *

సీ॥ శ్రీదేశికోత్తమ చిన్మయచిద్రూప । విన్నవించెద నొకవిన్నపంబు
నమలంబునద్వయ మగుణమవ్యక్తంబు । నగునిరామయ కేవలాత్మయందు

నామరూపకవి నిర్ణయకారణంబగు ? నీజగద్వైభవ మెట్లుగల్గె
ననినన్నిట్లనియెని రాకారమునన్య ? మొదవునాచిత్తంబు జెదరువలన

గీ॥ మిగులనాభాసమయ్యె నవిద్యసుమ్ము ? భ్రాంతిచేజూడ విశ్వమైపరిణమించె
తెలివిచేజూడ నాత్మయై తేజరిల్లు ? గాని వేరొండువస్తువ గానబడదు ॥

గీ॥ ఆత్మదప్పనెందు నన్యంబులేదంటి ♦ రింకభ్రాంతిదోచ నితరమేది
యెట్లుభ్రాంతిగలిగె నెవ్వరికదిదోచె ♦ నానతియ్యవలయునన్నిన జెప్పె ॥

గీ॥ తోచెనని చెప్పినందున దోచెశంక ♦ పుట్టెనని చెప్పదలచిన మొట్టమొదలు
నామరూపగుణములు వర్ణములు లేవు ? దానబుట్టినదని చెప్ప తగవుగాదు ॥

గీ॥ వినుముసుప్తికి తెలివి యేవిధముచాత ? ధర్మమగుచుండు నాత్మతత్వమునటుల
కారణములేని కార్యమై కానబడుచు ? దాననేతోచువిశ్వంబు దాననణగు ॥

గీ॥ జగమైభ్రాంతిచేజూడ జగముదోచు ? నాత్మభావనచేజూడనాత్మదోచు
గాన రెంటికిమూలంబు మానసంబు ? విశ్వమనుభ్రాంతిబంధంబు విడుపుముక్తి ॥

* కందార్థము. *

(౬౭) * లేనెరుకబయలులోపల * తానెట్లు జెనించెననిన * తగవినువంధ్యా
సూనునిగతివియదబ్జపి * ధానంబున యక్షరాజ * ధానివిధమునన్ * రజ్జువు సర్ప
మైనావిధమునన్ * స్థాణూపూరుషుని చందానామృగజలశశవి * షాణాములవలె
స్వప్నానందముగ * రాజధానివిధమునన్ * రజ్జువుసర్ప * మైనావిధమునన్ ॥ ౨ ॥

—* శ్రీశివరామదీక్షితీయమను బృహద్వాశిష్ఠం *—

( అ చ ల బో ధ శి ద్ధాం తం. )

* అ ధ్యా రో పా ప వా దం. *

గు॥ గుతేరిగే శరీరం యేమీలేదు । కోటిమాట్లకు యిదేజ్ఞాపకం । యింతకంటే
యెక్కువలేదు । గనుక । యిదిమరువవద్దు । కలలో శరీరం మేలుకొంటే యేమీలేదు
అని నిశ్చయంవున్నట్టువుండవలె । యీలాగై తేనే భ్రాంతిరహితం। మూలంలేని
యీగుతేరిగే శరీరంతోటి । యేమివున్నాదని । ఆశపడ్డా । భ్రాంతిరహితంకాదు

యేమీలేని। మూలంలేని యీగు తెఱిగే శరీరం। వున్నాదని భ్రాంతి। రజ్జుసర్ప భ్రాంతి। వుత్తతాడువలె పుట్టించావన్నది। సకల దేశాలయందు। సార్వకాలాల యందు। సమస్తమైన వస్తువులయందు। చలించక వుండంగా పాముతోచినట్టు మూలంలేని యీగు తెఱిగే శరీరం తోచిందిగాని। కలలోవచ్చిన శరీరం। వుండి మేలుకొంటే। యేమీలేదుఅని। నిశ్చయంఅయినట్టు। గురువాక్యం। "మూలంలేని యీగు తెఱిగే శరీరంయేమీలేదు" అని చెప్పంగానే। ఆలాగే నిశ్చయం కావలె కాకపాయనా। మరివక మార్గంలేదు। యేమార్గంనమ్మినా। రాజమార్గం కాదు। దొంగతోవలకు లెక్కలేదు। యిటువంటి గురువాక్యం। మూడుకాలాలయందులేదు। యిదినమ్మక। మరివకటినమ్మినా। ఆశమాత్రమేకాని। భ్రాంతి పోదు। విస్తారం అయినను। బుద్ధిమంతులుఅయినవారికేగాని। మిగిలినవారికిశక్యం కాదు। యిదిభ్రాంతిలేని విచారం। గురుసేవ వున్నాకొద్దిరుచి। గురుభక్తి విస్తారంగా వున్నాకొద్ది తనకు దృఢం। గురువాక్యం విడువకూడదు। యిదిజ్ఞానకర్మాలవంటి కలతవాక్యంకాదు। యింతకంటే అధికంలేదు॥

శి॥ అహైతే కలలోవచ్చినశరీరం। మేలుకొంటే యేమీలేదు। యిది ఆలాగే॥

గు॥ మూలంలేని యీగు తెఱిగేశరీరం। గురువాక్యంచాత। మేలుకొంటేయేమీలేదు॥

శి॥ సరిపాయ। కలలోవచ్చినశరీరం యీశరీరం వక్కటేనా। యీమత్తు యేమైనా యెక్కువా తక్కువా॥

గు॥ యీశరీరానకు మూలంలేదు। గనుక రెండు సమానమే। కాని। అదిలేత శరీరం। యిది ముదురుశరీరం॥

శి॥ అలాగుకాదు। గురో। దీనికంటే అదేపెద్దది। యిదే అనాథ। యీలాగంటే। సిద్ధమైన యేనుగ। చౌడోలి। రాజు। అనేకకోట్ల గుర్రాలు। అనేకకోట్ల మనుష్యులు। మూలంలేకనేవచ్చిరి। వచ్చి నూరేండ్లువుండి। సకలమైన ధర్మాధర్మాలు చేసిరి। అనేకమైన గోదానాలు భూదానాలు చేసిరి॥

శం - అందులో సన్యాసులుఅ ద్వైతమే దొడ్డదని కొందరితో వాదించిరి॥

## ౬. శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

రా - పెద్దవైష్ణవుడు విశిష్టాద్వైతమని యుక్తిచేసి అద్వైతం అఖండమనె ॥

మ - అందులో పెద్దమధ్వాచారి। యేమీలేని దేహాన్నిచూచి। నేను చేస్తాను అని। జీవుడు వేరే యీశ్వరుడు వేరే అని। ద్వైతమే తెప్పఅనిచేసె ॥

భా - అందులోనే భాస్కరాచార్యుడు అనే మనుష్యుడు। జ్ఞానం నిబద్ధిఅనె అది యేలాగంటే। కుక్కగుతెలిరిగే స్వభావంకలది। అలాగేఅందరూ తనకు తానే గుతెలిరిగేవారు। అందుకే తనకుతానేయెరుగు। అనేకకోట్లువచ్చినా యెరుగు। యిది గుతెలిరిగేది అభేద్యం। నాకంటేయిందరు వేరే వున్నారోలం దరుఅభేద్యమే। అందుకే జ్ఞానంనిబద్ధే। కర్మాలు నిబద్ధే। అన్నాను॥

గుతెలరుగక కర్మాలు చెయ్యరు। గనుక। యీగుతెలిరిగేజ్ఞానమే సకలకర్మాలు చేస్తుంది। గనుక। కొందరు దేహం చేస్తుంది అని అన్నారు। అంటే తప్పుగాదు। అదేలంటే వచ్చేటప్పుడు గుతెలిరిగే జ్ఞానశరీరాలే వచ్చినవి। గనుక। వున్నంత సేపు జ్ఞానం వుండనేవున్నాది। మేలుకొంటే యేమీలేదని అందరికీయెరుకే। అప్పుడు యేమియేమిగుతెలిరిగితిమో। అవ్వి। ఆపెద్దలు। ఆసిద్ధాంతాలు। మేలు కొంటే యేలాగుయేమీలేదో। అలాగే। "మూలంలేని యీగుతెలిరిగే శరీరం యేమీలేదు" అని। చెప్పంగానే। పుట్టిచావనిది। సకల దేశాలయందు। సార్వ కాలాలయందు। సమస్తమైన వస్తువులయందు। మొదలు కొనాలేక। తనకుతానే స్వతఃసిద్ధమైవుండె। జ్ఞానంఅంటే ॥

గు॥ యేమో। సార్వకాలం వాక్కతీగే। అందుకే సకలభ్రమలకుమూలం। మూలం లేనియీగుతెలిరిగేశరీరమేకాని। మరివకటిలేదు। గురువాక్యంతప్పవిడిచి। శాస్త్ర వాసనలో ప్రవేశించెనా। భ్రాంతి తిరుగదు ।

* గద్య *

ఇతి శ్రీసద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే

శరీరరహిత ప్రకరణం.

* భద్రాద్రి రామశతకము. *

* ప్రకృతిద్వయ సృష్టిరహితం. *

సీ॥ క్షరమక్షరంబులు సగుణనిర్గుణములు ॥ సత్యమసత్యముల్ సత్తుచిత్తు
కారణకార్యముల్ జ్ఞానకర్మంబులు ॥ పురుషుండుప్రకృతియు యెరుకమరుపు
పాపపుణ్యంబులు బంధమోక్షంబులు ॥ జననమరణంబులు జడమజడము
క్షేత్రజ్ఞక్షేత్రముల్ జీవదేహంబులు ॥ మానాభిమానముల్ మంచిశ్రభ
గీ॥ యిట్టిప్రకృతిద్వయంబులు పుట్టిగాను ॥ బట్టబయలందు యెన్నడుపుట్టలేదు
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు ॥ రామనరసింహదాస సంరక్షితాంహ్వ॥

* భావార్ధము. *

గా * క్షరమక్షరములు సగుణ నిర్గుణములు సత్యమసత్యములు సత్తు చిత్తులు కారణ కార్యములు జ్ఞానకర్మములు పురుష ప్రకృతులు యెరుక మరుపులు పాప పుణ్యములు బాధమోక్షములు జనన మరణములు జడాజడములు క్షేత్ర క్షేత్రజ్ఞులు జీవదేహములు మానాభిమానములు మంచిచెడ్డలు మొదలైన యిట్టి ప్రకృతి ద్వయములు బట్టబయలందు యెప్పుడు పుట్టలేదు.

* సదానంద యోగిశతకము *

గీ॥ వొకటిలేదు మరిరెండుతెఖలేల ♦ రెండునొకటియు లేకదా నిండియుండు
అట్టితత్వంబు దెలశిన నతడెయోగి ♦ నవ్యతరభోగి శ్రీసదానందయోగి॥

* సర్వార్ధసారసంగ్రహము *

సీ॥ నభమునసీలవర్ణములు దోచినరీతి ॥ శుక్తిరౌప్యంబుగా జూచినట్లు
పెనుమొద్దుచోరకుడనుకొన్న చందంబు ॥ త్రాడుపన్నగమని తలచువిధము
మరుమరీచికయందు నెరయజలాభాస ॥ మైనచందంబునాత్మలోన
చలనత్వమునను కేవలమహాకారణ ॥ సుగుపరబ్రహ్మ యందఖిలజగము
గీ॥ లెల్లసంకల్పమయములై యెరుకడివొ ॥ నమలనిశ్చల నిజమానసమునజూడ
నెపుడుబ్రహ్మస్వరూపమై యేకముగను ॥ వేరులేకుండు యొందున వెదకిచూడ॥

ల శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

చ॥ సలిలవిభేదతంతశశియసంఖ్య విభేదతదోచిలేస్సగా ।
నిలచిన యేకరూపమున నిర్మలుడైకనుపద్ధరీతిచెం ।
చెలగుణకారణంబున విశాలజగద్భ్రమనెంచెదచిత్తని ।
శ్చలగతినెంచిచూచిన నిజంబుగనాత్మవెలుంగునెప్పుడున్ ॥

కం॥ లేనినీకలిమివంధ్యా * సూనునివలెప్పుడు-రవి * సూనమువలెస్వ
ప్నానందమువలెగంధ * ర్వానీకస్థానమువలె * నని తెలియదగున్ ॥ ౭౫ ॥

* కందార్థము. *

(౬౭) * లేనెరుకను యెరుకనియన * లేనెరుకెట్లాయెననిన * లెస్సగవినుమా
లేనిమృగజలమువంధ్యా * సూనులుగలిగుండివెతకి * చూడాలేనట్లు * యీలేనెరు
కయూడాలేదిట్లు * స్థాణూపురుషుడుశశవిషాణాముగగనప్ర * సూనాముసరుని స్వ
ప్నానందమివివెతకి * చూడలేనట్లు * యీలేనెరుక * యూడాలేదిట్లూ ॥౩॥

—( సర్వార్థ సార సంగ్రహము. )—

ఉ॥ వేరననేలకేవల పవిత్రమహా ♦ పరమాత్మయుంనా
కారవిహీననిర్గుణము గామది ♦ జూచినదోచునట్లుగా
కారణకార్యరూపకజగంబని ♦ చూచినదోచునట్లుగా
దారువికారసామజవిధంబున ♦ నొక్కటిరెండుగనుపడున్ ॥

కం॥ యెందాక తెలివిదోచెను * నంవాకమనోవికార * మని తెలియదగున్
డెందమునకువాక్యంబుల * కందనిదేబ్రహ్మరూప * మదివివరయ్యా ॥

శ్లో॥ నహిప్రపంచోనహిభూతజాతో ॥ నచేంద్రియప్రాణగణానదేహః
నబుద్ధిచిత్తోనమనోనకర్తా ॥ బ్రహ్మైవసత్యంపరమాత్మరూపం ॥

శ్లో॥ నమేబంధోనమేమోక్షో ॥ నమేశాస్త్రంనమేగురుః
మాయామాత్రవిలాసోయం ॥ మాయాతీతోహమద్వయః ॥

* క ం దా ర్థ ము . *

(౬౧) * యెరుకోద్భవమెట్లన్నను * సరళంబగు నారికేళ * సలిలము భంగిన్ * యెరుకెట్లుబోవునన్నను * కరిమ్రింగిన వెలగపండు * కరణీగా నెరుగూ * తిరిగిరాని కరణింకో యెరుగూ * పరిపూర్ణమున్నాది యెరుకాతా నెరిగితె * యెరుకే మ్రిగ్గును * భస్మాసురుడు మ్రిగ్గిన నాటి * కరణీగా నెరుగూ తిరిగిరాని * కరణింకో యెరుగూ ॥ *

* క ం దా ర్థ ము . *

(౬౨) * సంతోషాసంతోషము * లంతలో గనవచ్చిపిదప * నరుగు నెచటికో * వింతైయున్నది చూచితె * యింతియెసుమియెరుకపుట్టు * వికదెల్సుకోరా * సంశయమేలా * యిదినమ్ముకోరా * యెంతొని తెలుపుదు యీదేవమార్గము * దంతాట బహువన్నెలగుపడియగుపడ * వికదుల్సుకోరా * సంశయమేలా * యిదినమ్ముకోరా

శ్రీ శి వ రా మ దీ క్షి తీ య మ ను బృ హ ద్వా శి ష్టం.

* అ చ ల బో ధ సి ద్ధాం తం *

శి - ఈకలలోనే నక్కనుసిష్యివచ్చే । వచ్చి ఎప్పటికి వాక్కతీరుగా । రాకడాపోకడా లేకుండా । వున్నదాన్ని । నాకు సూచనచెయ్యండి । అనె ।

గు - ఇదియెంత । పుట్టనిచావనిది । ఆలాగే నీవురాకమునుపు స్వతసిద్ధమైవున్నది అది తప్పితే మరిహోటిలేదు ।

శి - అషువంటిది యెక్కడవున్నాదో నాకుసూచనచెయ్యండి ।

గు - పుట్టనిచావనిదానియందే । నీవువున్నావు ।

శి - ఎషువంటిదో । సూచనచెయ్యండి ।

గు - చేస్తాగాని । నీవుఏమి ।

శి - నేనా । మూలంలేని ఈగుర్తింగేశరీరముసుం నేను ।

గు - నీకు మొదలుఏమీలేదు ।

శి - ఏమీలేదు ।

గు - నీస్వభావం యెషువంటిదో । కొంచంచెప్పావూ ।

శి - నాస్వభావంఏమి ।

గు - ఉన్నట్టేవుండేది । ఏమీలేకపోయ్యేది । కొనకు ప్రవేశించేటందుకు । స్థానంయేమీలేదు । మొదలు కొనా వుంటే । యికఏమిచింత । సార్వకాలం భ్రాంతి । వుంటేవిడువకనేపోవు । ఈ కాసేపువున్నంతలో । సకల క్లేశాలు । సకలసుఖాలు ఇదేనిబద్ధిఅయితే । ఇదేయెమలోకం । దీనివంటి భ్రష్టులేదు । దీనివంటిశిష్టులేదు । దీనికియేమైన । వపురోగం । సంపత్తు । దరిద్రం । యేలాగోఆలాగే ।

శి - సరేకాని వున్నప్పుడు । పఘుతీరుగావుంచుంది । క్షణేక్షణే । ఏమీలేక । మళ్ళాయెక్కడినుంచివస్తుంది ।

గు - దీనిరాకడా యెవ్వరుయెరుగరు । దీనిపోకడాయెవ్వరుయెరుగరు । సకలమాయలూ మూలంలేనియీగుర్రైరిగేశరీరంచేశింది । ఇదియేలాగంటే ఆలాగే । దీనివంటివారి తోటి । ఇదికొన్నిమాటలు । మందికొన్నిమాటలు । సుషుప్తిఅన్నారు । మరణం అన్నారు । తానుయేమిఅన్నది । వుంటేపు డేది । లేకుంటేయేమిలేదు ।

శి - నిద్ర నేనుయెరుగ । మరణం నేనుయెరుగ । నేను వున్నంతసేపు । నాకుయెరుక అయిన । మరుపుఅయిన । నేనులేకుంటేఏమిలేదు ।

గు - నిబద్ధిగా నీవుయేమి ।

శి - నాదెగ్గర యిన్నిమాటలులేవు । యిప్పుడు కలలో మహాపెద్దలువచ్చినారు । వస్తే వారు అంతాపెద్దలేనా । అందులో కొంత యెక్కువ తక్కువ వున్నాదే ।

గు - వారికాలుగోరువద్దినుంచి । జుట్టుదాకవొక్కటే । వారిలోపటకొంతనిబద్ధి । కొంత అబద్ధం అనినా అదియేమి । వున్నంతసేపూ । అంతానిబద్ధే । మేలుకొంటే ఏమీ లేదు । నిబద్ధీ । అబద్ధం । రెండుఏమీలేదు । అప్పైతే । వున్నదియేమీ ।

శి - అదితెలియకనే । మూలంలేని యీగుర్రైరిగే శరీరాన్ని । నమ్మర్దాదని । మీ దగ్గరికివచ్చినా । నీవు యేమిచెప్పాభావయ్యా । వక్కసారిచెప్పండి । మూలంలేని యీగుర్రైరిగేశరీరమునునేను । ఇఘుదీనిజోలిలేకుంటే । వున్నదివున్నట్టే । సూచన అయితే । తనకుతానే సూచనఅవుచాది ।

గు - అప్పైతేవిను । అఘువంటిదానియందు నీవువున్నావు । నీయందు అదిలేదు ।

శి _ నాకు సూచనఅయితే । అన్ని నాకుసరిపోవలె ।

గు_ఆలాగేకాని నీకు అనుమానంలేదుగదా ।

శి _ నాకు శీఘ్రంగా సూచన చెయ్యండి ।

గు_లెస్సవిను । పుట్టనిచావనిది । మొదలుకొనాలేనిది । రాకడా పోకడాలేనిది । సార్వకాలం వొక్కతీరుగావున్నది । సకలదేశాలయందు । సార్వకాలాలయందు । సమస్తమైన వొస్తువులయందు । చలించక తనకుతానే స్వతఃసిద్ధమైవున్నది । మూలంలేని యీగుర్తెరిగేశరీరానకు దానికి కొంచమైన సంబంధంలేదు । అది ఇది కాదు । ఇదిఅది కాదు । అది । ఇషువంటిది । కోట్లశరీరాలు వచ్చినా । యేమీ లేకపోయినా । అది । దీనిజోలిఅయినా । యెరుగక । ఏలాగున్నాదో । ఆలాగున్నుంది ।

శి _ సరే । ఇందుకుఅనుమానంలేదు । మూలంలేని యీగుర్తెరిగే శరీరానకు ; మొదలుయేలాగో । కొనయేలాగో । వున్న వ్వాళుఆలాగే । మొదలుయేమీలేదుకొనకు యేమీలేదు । అన్నిఅందరికియెరికె ।

గు_ఆలాగుకాదు । కలలో యేనుగమీద కూర్చుండి । మహాపెద్దలు వచ్చిరి । మనకు పుట్టనిచావనిదానిజాడ సూచనచేసిరి । చేసి మేలుకొనిరి । వారుమేలుకొంటే వారికిమనము యేమైనా వున్నామా ।

శి - యేమీలేదు ।

గు_మనము మేలుకొంటే వారుయేమైనావున్నారా ।

శి _ యేమీలేదు ।

గు_పుట్టని చావనిదే వున్నదిగదా ।

శి _ వున్నదేఅది ।

గు-వారుయేమైనా అనుకుంటూవున్నారా ।

శి - మనము యెందుకుఅనుకోను । యీలాగుఅన । అనుకునేదిఏమీ । వున్నదియేలాగు వున్నదో । ఆలాగేవున్నది । సార్వకాలం వొక్కతీరే । వున్నదియేమీఅనుకోదు రెండోది గురుకటాక్షంచాత । యేమనశక్యంగాకపాయ ।

గు- షాభాస్ । మహాఅధికుడవే ।

శి - ఈలాగు వుండవద్దా ।

గద్య.

* ఇతి శ్రీమద్గురు శివరామ దీక్షిత ప్రభావే వేదాంత విచారణే *

అష్టావింశతి ప్రకరణం.

* కందార్థము.

(౭౦) * రాకడపోకడలేకను * యేకస్థితినుండునట్టి * యీబయలందున * రాకడ పోకడగల్గియు * నేకముగాదోచులేని * యెరుకా సుశీలా * ప్రతిమలో లేని * పెరు మాళ్లలీలా * లేకాత్తోచిన యెరుక లేనే లేదను మనీ * కీకీ·బగురునిచేయెరుకై తేజాలుల్లో కైరకాసుశీలా * ప్రతిమలో లేని * పెరుమాళ్లలీలా॥ * * *

—( శ్రీ శివరామదీక్షితయమను బ్రహ్మానిష్ఠం )—

అచలబోధ సిద్ధాంతం.

గు - జగత్తు లేదుఅంటే । ప్రత్యక్షముగ వున్నది । అంటే చూడంగానే యేమీ లేదు చూస్తే యేమీ లేదు । అపైతే వున్నదాన్ని నమ్మటానికి లేదుఅనినమ్మినా వున్నది అంటే వుండదు । లేదుఅంటే వున్నది । రెండు సకటమేవున్నది । రెంటికా సాక్షటమే । గురుకటాక్షంచాత । వున్నది వున్నట్టు తెలిపితే । వుంటేవుండని । లేకుంటే లేకపోని । దానిజోలి తనకు నిలేదు । నిర్ణయం వేదాల చాతకాకపోయినది శాస్త్రాలచాత కాకపోయినది । ఆచార్యస్వాములవారు । లేదనినిర్ణయంచేస్తే యెవరికిలేదనినిశ్చయంకాలేదు । నిశ్చయమైతే । పుణ్యతేప్పుడు మొందుకు చేస్తారు। చస్తేసూతకంయెందుకుపడుతారు । బ్రతికితేసంతోషం । చస్తేదుఃఖం । యెందుకు పడుతారు । అందుకు అదిఅగత్యం లేదని । నమ్మికె యెవరికీలేదు । రామానుజా చార్యులగారు । ప్రవాహ రూపకంగా । జగత్తు సార్వకాలం వుండనేవున్నదని అన్నాడు । వారువుంటే సుఖదుఃఖములు కలిగివున్నారు । వున్నదెప్పుడు చూడండి

చస్తుందిఅని అన్నందువల్ల । వికారరహితం సంభవించకపోయెను । చిత్తేశేషము
అని అన్నందువలన । వికారరహితం సంభవించక । సుఖదుఃఖరహితం సంభవిం
చకపోయె । శిలాప్రతిమవత్ । అని । దేహీ దేహానకు । అవినాభావసంబంధం
వుండ చెప్పినారు । గనుక । దేహి దేహానకు విశిష్టంతప్పదు । దేహానకు ఉపద్రవం
వస్తే యేడ్చేది దేహిగనుక । దేహికిసుఖదుఃఖాలు లేవని । శాస్త్రం చెప్తూవు
న్నది । ఆపెద్ద అబద్ధశాస్త్రాలు అబద్ధాలు । అబద్ధాలకు వేదవాక్యాలు అను
కూలాలు । దేహీనిబద్ధి । దేహంఅబద్ధం । అని । ఆచార్యవ్యాసులవారు । శృతి
మూలంగా చెప్పినారు । సుఖదుఃఖాలు దేహివున్నంతసేపేగాని । దేహి లేకుంటే
దేహానకు లేవు । సుషుప్తియందు దేహి లేకపోయినాడు । గనుక । సుఖదుఃఖాలు
ఎరుకలేదు । దేహివుండగా సుఖదుఃఖాలు సిద్ధం । దేహినిబద్ధిఅయితే । దేహం
వున్నదనినిర్ణయం లేదు । గనుక । దేహివున్నదనే భ్రాంతి వున్నంతసేపు । జనన
మరణ భ్రాంతి తప్పదు । అందుకే । అద్వైతం నమ్మకుంటే విశిష్టాద్వైతానకు మూ
లం లేదు । గనుక । ఈరెండు లేకుంటే । మధ్వసిద్ధాంతం మాటమాత్రమైన లేదు
అంగడిసాగితే తానతాకలము అన్నిదినుసులు వున్నట్టువుంటావి । అంగడి లేచిపోతే
మునుపు ఏమంతో అంతే । మళ్ళీసాగితే సాగుతుంది । సాగకుంటే సాగదు । ఈ
అద్వైతం విశిష్టాద్వైతం । అనువంటివే । కృష్ణావతారం వలెనే । రామావతారం
వలెనే । లోకములో । భాగవతాలఆటవలెనే । స్వప్నాలవలెనే । ఇంతే కాని । యే
సిద్ధాంతం నమ్మినా । జగద్భ్రాంతి తప్పదు । నిజగురుసాంప్రదాయం నమ్మినా । సర్వ
శూన్యం కాగలదు । వున్నదనివ్యవహారం లేదు । సార్వకాలం వక్కతీరుగా లేదనేవ్యవ
హారం లేకుండా । వక్కటైనా వికారం లేక । పుట్టక చావక వున్నది । యేలాగున
వున్నదో ఆలాగే వుంటాడు । జ్ఞానభ్రాంతి లేదు । కర్మభ్రాంతి లేదు । చూస్తే అందరి
వలెనే వుంచాడు । విమానుపడు । పట్టాపట్టడు । అనువంటివాడు సమయోచిత
ప్రజ్ఞచాత । బాధలేకుండా వుంటాడు । అనువంటివాడు । బ్రహ్మఋషిని నమ్మినవ్వ
ఛాండాలుపనివిమావద్దు । భ్రాంతిరహితం కావలెనని ఇచ్ఛవున్నవాడు । వారి
సేవచేస్తే । వారికి దయవస్తే । తమవలెనే జగద్భ్రాంతి లేకుండా చేస్తారు । ఇంతే కాని
మరియొకప్రకారంగా స్వాధీనం కారు । వంచనలేక సేవచేసినాకొద్ది । పైకంయివ్వ

నిదే స్వాధీనంఅవుతారు। అయ్యా అని అడుగనిదే దయచేసిచెప్పుతారు। వంచకు డైనా ధూర్తుడైనముండాకొడుకైనా। శక్తిమతములో కలుపుతారు। కలిపితే మునుపటికంటే ఘట్టివాడై సంతోషపడుతాడు। పత్యాలు పీత్యాలు సంతోష పెట్టినవి। గనుక। మాగురుస్వామిచరణాలేదిక్కని। సార్వకాలంయేదైనా వకటి చేస్తారు। స్త్రీలకు సంతోషమే। పురుషులకు సంతోషమే। పత్యాలు పీత్యాలు లేక వారలతో సంభాషణ చెయ్యరాదని। నిశ్చయంచేసుకొని। తమఅనుకూలాల తో। సహవాసంచేసుకుంచూ కాలంగడుపుచారు। మనచే శ్రేష్టులమనుకుంచూ కోడివలెకూసుకుంచూ। కుక్కలవలే సంతోషపడుచారు। లేవంగానే అదేచిం తా, వంచనలేని శిష్యుడుఅయితే। భ్రాంతిలేనిమార్గం చూపమనిఅడుగాడు। గురు సాంప్రదాయం మహాదొడ్డదికావలె। ఆచార్యస్వాములవారిమీద అనురాగం రామానుజాచార్యులవారిమీద ద్వేషంలేని గురుసాంప్రదాయ కావలె। జగత్తు లేకపోదు। వుండావుండవద్దు। నిర్ణయంలేని సాంప్రదాయంకావలె। స్త్రీలింగ పుల్లింగ నపుంసక లింగత్రియంచాత చెప్పబడ్డది। నిజస్వరూపం। అందుకే దేవ తాకాదు। దేముడు కాదు। బ్రహ్మముకాదు। అంగంలేనివాడు। గనుక। గుర్తెరిగే చైతన్యం కాకుంటే యేమీఅనశక్యంకాదు। ధ్యానంలేకుండాగా। క్రియాశూ న్యుడు। మళ్ళి అందరివలెనే చేస్తాడుగాని। రాగద్వేషరహితుడు। ఆమహాత్ముని దీర్ఘకాల సహవాసముచేత గాని తెలియదు। నీచులప్రభావమువలె శీఘ్రంగా బైటపడదు। మహా కఠినం। చూచినేర్చుకోవలె। వారిజాడ వారి అంతవారికే కాని మిగిలినవారికి శక్యంకాదు। జనక చక్రవర్తి ప్రసిద్ధివలెనే। కృష్ణస్వభావము వలెనే। వీరియొక్కజాగ్రతా। ఆవరణం లేనివారు గనుక వారివ్యవహారానకు మర్యాదా లేదు। చెయ్యనివారు గనుక జ్ఞానకర్మలు లేనివారుగనుక। ఎప్పుడువక్క తీరే। సార్వకాలం పెద్దలసహవాసమువుంటేనే। మహాసృష్టం ఇంతకంటే అధికం లేదు। యిదినిజగురు సాంప్రదాయం।

గద్య.

* ఇతి శ్రీమద్గురు శివరామ దీక్షిత ప్రభావే వేదాంత విచారణే *

భ్రాంతిరహిత ప్రకరణం.

* కందార్థము. *

(౭౧) * వనగల్లుదశములోపల * తనకై తావచ్చితనకు * తానేగువిధం * బున పరిపూర్ణములోపల * తనకై తావచ్చిమెరుక * తనకై తాజనునూ * అచలంబున్న * దనితానెరిగిననూ * తనలేమినిజమాని తనకేతోచునుతోచి * తనకల్మిమృష గాథా* వన జేసినిలువక * తనకై తాజనునూ * అచలంబున్న * దనితానెరిగిననూ ॥

* కందార్థము. *

(౭౨) * పరిపూర్ణములోదోచుచు * మెరుకేచను తనకుదానె * మేషప్పడ వినుమీ * తోరటలుతోమ్మిదిగలదై * తరితీపులనొందు చుండి * తనువనదగుచూ * అచలమునుగన్గొనితాలేనసుచూ * మరుగిల్లెరుకకు దెలియు * మెరుకేసిల్వదుగాని * పరిపూర్ణముండు దాన్నెరిగేదెట్లిగుతుణ * తనువనదగుచూ * అచలమునుగన్గొని తాలేననుచూ ॥ * * * * *

* కందార్థము. *

(౭౩) * తోలు కారుమెరుపుకై వడి * పొలుపుగ నీళ్లందుదోచు * బుగ్గలరీతిన * అలసూర్య కిరణమందున * గలనీళ్లంబలనె మెరుక * గనుపించునయ్యా * అంతలో మెచట * గనుపించదయ్యా * కలకాలమొకరీతి గలిగుండదీమెరుక * తిలకింప పవలురాత్రిరెదిరుగువిధమూన * గనుపించునయ్యా * అంతలో మెచట* గనుపించదయ్యా

—( * గురుశిష్య సంవాదము. * )—

* ద్విపద. *

సవిశేషముగనొక సమ్మతివినుము ♦ వితత కారడవిలో విపులశ్రమబొంది
మతిదప్పినిద్రించు మనుజునిపులియు ♦ గొనిపోవువిధమున గొంకక హెచ్చి
దారపుత్రమమత దగిలినవాని ♦ నేరుపుశోమృత్యు నెమ్మిహరించు
నప్పుడుబంధువు లందరువచ్చి ♦ తప్పించియామృత్యు దొలగంగ జేసి
విడిపింపగాలేరు విరివితోమమత ♦ కడుతవిలియుండుట గాదనితలచి
యిప్పుడోయప్పుడో యెప్పుడోతనువు ♦ చెప్పరాదీమాయ జలబుగ్గరీతి
నెరసియేబడియేండ్లు నిద్రికుబోమె ♦ పరగ బాల్యమునకు పడ్డెండుపోమె

పడపడిజరావస్థ పాలైనయేండ్లు ♦ పదిరెండుపోవగా పైబడుదారు
చెప్పిచూపగరాని చేష్టలవయసు ♦ గప్పికామాంధమున తనుగానరాక
గాజనగుణముతో రవళించిమించి ♦ స్త్రీజాలములగూడి చెలరేగియాడి
కామితార్థంబుల కాంక్షలదవిలి ♦ నేమకర్మాదిక నిష్ఠలబోరలి
పోవునూరేండ్లిట్లు పురుషునకనుచు ♦ భావించితెల్పగా పరికించిచూచి
సిద్ధంబుగాగురు శిక్షణమనడపి ♦ బద్ధత్వమునుమాని పరమాత్మగాంచి
కరికర్ణకీలని కడుచంచలంబు ♦ మెరుపుచలనముగతి మేనని తలచి
బలునైన వైరాగ్య భావంబునొంది ♦ నిలచియుండుమునీడు నిజముముకనను ॥

(*) గురుగీతలు. (*)

సీ॥ తనువునిత్యంబుగా వనుదినంబును నెంచ । సలిలబుగ్గలకన్న జులకనగుట
చీము నెత్తురులచే జిగురుచునుండుట । మలమూత్రములు రెంటి మలసియుంట
విషయవాంఛలసదా విజృంభించుచునుంట । జోకైననరముల జుట్టియుంట
పాతకహేతువౌ భ్రాంతినిబొందుట । జాతసూతకములచే దగులుట
గీ॥ యంతమందునయమబాధకమరియుంటయమునకునియమించునట్టిభవము తెలయుట
యమితరోగంబులనుగూడినట్టిపట్టి । బూటకంబైన దేహజంబుమాటమేలా ॥
శా॥ అన్నల్ దమ్ములునత్తమామలు । ప్రియంబౌ భార్యయునుండియున్
నెన్నన్ దేహమువీడు వేళ । నునీవెంటవ్వారెవ్వరున్ రారుగా
కున్నన్ నక్కురతోస్మశానమునకున్ । గొంపోయిదావాగ్నిలో
దన్నర్పించియుమళ్లిచూడకను । బోతంత్రిజ్ఞలేశాంభవీ ॥
సీ॥ కాననంబుననొకరుఘనుడుమార్గముతప్పి । శ్రమచేతసంచారక్రమములుడిగి
తరుమూలమునవిద్ర మరిజెందియుండగా । బులివచ్చియతనిగొంపోవువేళ
నిద్రావిరహితుడై నెరిలేచియటమీద । నయ్యోడుహేతువు నరయలేక
పుత్రమిత్రకళత్రభ్రాత్రాదులదలంప । వారువచ్చియుమృత్యు వదలజేసి
గీ॥ నిలుపలేరైరిగానవీరలనుగూడ । నేమిఫలమని నిత్యత్వమెన్నవలయు
నిప్పుడెప్పుడోయెప్పుడో చెప్పరాదు । తనువువీడుటయొకదినమనుచునెంచి ॥

సీ॥ శతవత్సరంబులు సతమన్నియెంచెనా । సగమేండ్లు నిద్రచే సమసిపోయె
బాలత్వకౌమార పౌగండవయసుల । ఘనతనిర్వ్యదినాల్గు గడచిచనియె
నికమీఁదమిగిలిన యిరువదియారేండ్లు । రాజసగుణముల దేజరిల్లి
చెప్పిచూపగరాని చేష్టలబెనగొని । కామాంధుడై స్త్రీలకాంక్షజేసి
గీ॥ కామితార్థంబులనుగోరి కష్టమైన । నియమసత్కర్మములను బొందినెరినిట్లు
జరుగునారేండ్లు పురుషునకరసి తెలసి । పరము జేరంగ వాంఛించుసుమ చిరాంగి ॥
కం॥ కరికర్ణము హాయవాలము * మెరుపులతీరనుచు దేహ * మేనమ్మకశ్రీ
కరమగుమార్గము గనుగొని * పరమొందుము మనసు నిలిపి * పద్మదళాక్షి ॥

* కందార్థము. *

(28) * కట్టెంకునిప్పులేని నె * కట్టియనొక సమయమందు * గనుపడి బహులుగా *
మిట్టిపడితు నకు గనుపడ * చట్టి దెసుని మొక పుట్టు * పములాంవిచారా * తనకుదానే
యమ దెంచెనారా * పుట్టుగిట్టుటలానే * నట్టేటన్నిలమండి * బట్టబయలు పాడగట్టిన
గనుపడ * దమలా విచారా * తనకుదానే * యరుదెంచెనారా ॥ * *

* కందార్థము. *

(29) * తనమూలము తలిదండ్రులు * తనవలెనే వారు వారి * తలిదండ్రులకును *
తనవలెనె కానియన్యము * గనజననస్థానమొకటి * గలదన తరమా * బ్రంహ్మాదుల
కదిదెలియతరమా * వినుమా యీబ్రంహ్మాండ * జననాముని నాయం * దునన్నైన
దిదియుగాదని వేరేయుంకోటి * గలదనతరమా * బ్రంహ్మాదుల * కదిదెలియతరమా ॥

—( శ్రీ శివరామదీక్షితీయ మనుబృహద్వాశిష్ఠం )—

* అచలబోధసిద్ధాంతం *

శి - యీశరీరానకు । మూలంయేమీ లేదని । మీరు అంటిరి । కొనకు ప్రవేశించేటం
దుకు । స్థానంయేమీలేదు అని । అంటిరి । వున్నప్పుడు వున్నదియేమో అని । అంద
రూ అనుకుంటే । "మూలం లేనియీగు తెంరి గేశరీరం యేమీ లేదు" । అని । మీరే
శ్రవణాచేస్తిరి । యీలాగు నిర్ణయం అయినవారికి । యేమిభయం ॥

గు॥ అయితే యీలాగుదృఢమేనా ।

శి॥ వున్నదివున్నట్టేపడె ।

గు॥ యీలాగుదృఢంవుంటేసరి । అందరికీ యీలాగు దృఢంవుంటే । పుట్టనిచావనిది । తనకుతానే స్వతఃసిద్ధమై చలించక వుండనేవున్నది । యిందుకుఅనుమానంలేదు । గురుసాంప్రదాయం । పుట్టనిచావనిది । మొదలు కొనాలేనిది । రాకడాపోకడా లేనిది । సార్వకాలం తనకుతానే స్వతఃసిద్ధమై చలించకవున్నది సకల దేశాలయందువున్నది । సార్వ కాలాలయందు వున్నది । సమస్తమైన వాస్తువులయందు వున్నది । శరీరాలలో ప్రవేశించనిది । వెళ్లిపోనిది । శరీరాలుకానిది । శరీరాలపుట్టించనిది । శరీరాలగుర్తెరుగనిది । శరీరాలకుఆధారమైనది । శరీరాల స్ప్రుశించనిది । జగత్తువున్నదని తోచనిది । సార్వకాలం వొక్కటీరుగావున్నదాన్ని । కుండను ప్రత్యేక్షంగా చూచినట్టు । తెన్నువుండ చూచి । యీశరీరానకు । మూలంయేమీఅని అడిగితే । లేదు అనిచెప్పినా యీలాగో దృష్టాంతమడిగి । దృష్టాంతం తెన్నువిని । ఆదృష్టాంతంచొప్పున । సమాధానంచేసుకొని । శాంతిఅయ్యేది । గురుసాంప్రదాయం యింతేకాని । మూలంలేనియీగుర్తెరిగే శరీరంచాత । సాధనచేసి సాధింతామంటే । కోటిశరీరాలచాతనైనా । సాధ్యంకాదు । యీశరీరంమూలంలేనిది । కొనకుప్రవేశించేటందుకు । స్థానం యేమీలేనిది । వున్నప్పుడు వున్నట్టేవుండి । వెంటనే యేమీలేనిది । అన్ని చూచేప్రజలకు । అందరికీనిశ్చయంకద్దు । తనకువున్నంతసేపేకాని । కొనకు యేమీలేదు । గనక । ఆనిశ్చయం తనకుతానే లేదు । గురుకృపచేత । మూలంలేని యీగుర్తెరిగేశరీరం వున్నంతసేపు । అనేక శరీరాలు తనకుతానే తోచేది స్వభావం । కలతోచినట్టే మేలుకవున్నంతసేపుతోస్తాది కలతోచేటందుకు । మూలంలేని యీగుర్తెరిగేశరీరమే మూలం । గనక "మూలంలేని యీగుర్తెరిగేశరీరం యేమీలేదు" అని । తాత్పర్యమాయనా । ఏమీతోచదు । తోచేటందుకు మూలంయేమీలేదు । గనక । తనకుతానే స్వతఃసిద్ధమైయున్నది । వున్నదివున్నట్టుపడితేసరి । వున్నది వున్నట్టుపడితే వకటైనా యిచ్ఛవుండదు । వున్నదివున్నట్టుపడ్డందుకు । ఇదేచూచుకోవలె । ఇచ్ఛకుమూ

లం మూలంలేని యీగుర్తేగా శరీరమే కాని। తనకుతానే స్వతసిద్ధమైవున్న పరిపూర్ణులకు ఇచ్ఛ యెన్నటికి లేదు।

శి మీరు విచారించండి। ఈబట్టబైలుకు యేమియిచ్ఛవున్నది। ఈబట్టబైలుకు యెరుక లేదుగనక। ఇచ్ఛలేదు। ఇచ్ఛలేదగనక। సంసారవాసన రతికర్మంలేదు రతికర్మంలేదు గనక। తానుపుట్టలేదు। రెండోదాన్ని పుట్టించ పుట్టించడు తాను పుట్టకపాయ। రెండోదాన్ని పుట్టించ్చకపాయ। ఈశరీరం యెక్కడ నుంచివొచ్చే।

గు ఈ బట్టబైలుకు అడుగుతావా। నన్ను అడుగుతావా।

శి ఈబట్టబైలుకు శరీరంలేదు। దాన్ని యేలాగు అడుగ। ఆదియేలాగు చెప్పతుంది దానికి వ్యవహారమేలేదు।

గు సరిగదా। అయితే యెవ్వరిని అడుగుతావు।

శి నిన్ను।

గు నేనుఏమీ।

శి నీవుయేమో। మాకుమా చేటంగాకు। పూరికే లేనిశరీరం వున్నట్టువున్నది।

గు మీకుశరీరంవున్నాదే।

శి ఉన్నది। నాకూ మీకూ శరీరం వున్నట్టువున్నది। మీరు శరీరంయేమీలేదు అని। సూచనచేస్తూవున్నారు। గనక శరీరంలేకపోవుటం యేలాగోఅని। మాకు ఆశ్చర్యంఅవుతుంది। ఇది యేమిటని అనిపిస్తుంది।

గు శరీరంవున్నదిఅని। మీకేగాదు। నన్ను యెరుగుచూచేవారికి। అందరికిశరీరం వున్నదిఅని। యెరుకే। చూచినవారికెల్లా। శరీరపు వర్తమానం। శరీరం లేనిదానివర్తమానం తెలిస్తే। మూఢులు యేరి। అజ్ఞానులు యేరి। మూర్ఖులు యేరి। ప్రత్యక్షప్రమాణమని। వాదించేచార్వాకులు యేరి।

శి అట్లైతే మేముఘుమూలమా।

గు దేహాలకు మూలంయేదో। అది। మీకు యథార్థంగా తెలిపినానసరే। మీతండ్రిగారికి తెలిపినానసరే। మీతాతగారికి తెలిపినానసరే। మీముత్తాతగారికి తెలిపినానసరే। మీకుయెవ్వరైనా గురువులువుంటే। వారికి తెలిపినానసరే। యిప్పుడు

మీరు విచారించి చెప్పినారసరే। శరీరం ఫలానిదిఅని। తాత్పర్యం చేసుకుంటే
నేనూ మీరూ। అంతరమూ మూఢులమే। అందరం జ్ఞానులమే। అజ్ఞానులమే
అందరం సమానులమే। ఇదివున్నట్టు తెలియకుంటే। చాకలచదువు। కోటి
విద్యలు కూటికొరకుఅన్ని। చాకలవాడు అంచుప్పున్నాడు। మళ్ళీఅందరికి దా
నుడైవున్నాడు। అందరికి సేవకుడుగనక। నిత్యులవలె యెక్కువ అనుకోడు
మిత్తులవలె తక్కువఅనుకోడు। అందుకే। బ్రహ్మకుమ్మరవాడు। విష్ణుసాలె
వాడు మహేశ్వరుడు। చదువుకున్నవానికంటే। యెక్కువవాడు। అందరు
సమానమే। యెవ్వరికులధర్మం వారువిడువక। స్వధర్మాలచాతవున్నారు గనక
అందుకే శరీరంవున్నదిఅని। దృష్టంవున్నది। అనుమానమూవున్నది। ఎప్పుడు
పోవుందోఅని। అందరికీ అధైర్యం కద్దు। యీగుర్తెరిగేశరీరాలు యేలాగంటే
ఆలాగేవిని। వున్నంతసేపు భ్రాంతులతో ఉన్నంది। కొనకు। సకలశరీరాలు
యేమీలేవు। యెక్కడినుంచివచ్చే। యెక్కడికిపాయె। అని। యెవ్వరికివిచా
రంపుట్టను। పుట్టినా అనేకదొంగలవలే। కాని। రాజమార్గంవొక్కటైనా
కాదు।

శి మాకు ఇన్నియెందుకు। ఈ శరీరంయెందుచాతవుంచుంది। లోకంలో అనేక
మాటలు అనుకొంచారు। మీరు మాకువున్నదివున్నట్టు। సూచనచేయుండి।

గు చేస్తావిను। మీతల్లి తండ్రి నీకుమూలం। నాకుఆలాగే। వారిస్వరూపంమనము
యెంతోఅంతే।

శి అయితే। వారుయెక్కడినుంచివచ్చిరి।

గు ఈలాగు వారికివారు। వారికిమనము।

శి అయితే ఈప్రకారాన। సార్వకాలం। వుండనేవుండె।

గు వుంటేయేమి యెన్నడులేకపోయింది। సార్వకాలం నీశరీరం నాశరీరం వున్నంత
సేపు। సర్వం వున్నట్టేతోస్తుంది।

* ౫ ద ౪ *

ఇతి * శ్రీమద్గురు శివరామదీక్షితపరిభావే వేదాంతవిచారణే
భ్రాంతిరహితప్రకరణం.

# శేషధర్మములు

కం॥ శరణాగతవత్సలస * త్కరుణాపరిపూర్ణనేత్ర * కౌస్తుభరత్నా
భరణభవహరణయుష్మ * చ్చరణాంబుజములు భజింతు * సతతముభక్తిన్

కం॥ పరమేశపాపకర్ములు * దురితంబులొనర్చి ఘోర * దుస్తరనరకో
త్కరమునవశించివారల * ట్లరయంగాముక్తులగుదు * రానతియీవే ॥

వ॥ అతిప్రయత్నంబువలన ముక్తులగుదు రేనియు వారికి నెద్దిగతి వారలేమగుదు రెట్లు గర్భంబులయందు ప్రవేశింతురు గర్భస్థులై పుట్టియు నేమియొనరింతురు వృక్షత్వ పశుత్వ మృగత్వంబులయందు నెత్తెరంగున వర్తింతురు సర్వంబునుం దెలుపవేయన్నిన నతనికి నతనుజనకుండిట్లనియె.

కం॥ ఖలులైఘనతరకలుషం * బులుజేసిమహోగ్రనరక * ములబడినజనం
బులవర్తనంబులెల్లన్ * దెలిపెదవినవయ్యవసుమ * తీవరతిలక ॥

వ॥ పాపాత్ములగువారు ఘోరనరకంబులయందనేక కాలంబు క్లేశంబులం బొంది యట్టకేలకు దైవయోగంబున ధాత్రిం బ్రవేశించి.

* వృక్షోత్పత్తి, పర్వతోత్పత్తి. *

గీ॥ అఖిలదుఃఖావృతంబునునశిలకంట • కప్రియుక్తముపద్రవకారణంబు
నైనస్థావరరూపంబునధివసించి • పుట్టుచును జెడుచునుందురుభూపవర్యా॥

కం॥ తరువులునఖిలధరిత్రి * ధరములుగుల్మములును * లతాతతులుద్రుణో
త్కరములువిలున్నిస్థా * వరములనంబరగునిందు * వంశవతంసా ॥

వ॥ యిట్టి స్థావరత్వంబు వహించి.

సీ॥ కారడవులలోన దారుణదవవహ్ని • మహనియ్యశిఖలంటి మండిమండి
అతిదుస్సహంబైన శతపత్రహితునిచే • యెండలనందంద యుండియుండి
దుర్దినంబులయందు దొరఁగుజలాసార • ధారాళధారలన్ దడసితడసి
నిష్ఠురగతివీచు నిర్భరవాతూల • విసరసంహతులను విఱిగివిఱిగి
గీ॥ ఫలచయార్థంబు గేహసంభారములకు • వంటకట్టియలకుగొట్టు వాడిపరశు

పాతములబగిలిపగిలియు బహుళఖేద క్లే మొందిచిరకాలమువసిపైయుండియుండి

* క్రిమి జన్మము. *

వ॥ అతంబంచత్వంబునొంది క్రిమి యోనులంబుట్టుచు క్రిములై క్షణార్ధంబు బ్రతుకుచుక్షణార్ధంబు నాశంబునొందుచు మలమూత్ర మాంసాదులయందుచరించుచును సుఖంబు లేశంబు నెరుంగక దుఃఖించి.

* పక్షి జన్మము. *

గీ॥ అంతటబతంగయోనులయందుబుట్టి ♦ బలిమిపక్షులుదుర్బలపతగములను
మాంసలోలుపులైతినమానవేంద్ర ♦ నిధనమునబొందునొకకొన్ని నిలుపులేక

వ॥ మరియు కొన్నియండంబులవిశి నాశంబునొందుచు కొన్ని గృహాంగణంబుల బంధంబులైయుండుచు కొన్ని పక్షంబులులేక గూళ్లయందు నోసరించుచు కొన్నిమనుజులచే భక్ష్యమాణంబులై సమయుచు కొన్ని నరుల యాహారార్థంబు ఛేదింపంబడుచు కొన్ని బలియిచ్చుకొరకు నిర్జింపంబడుచు కొన్ని రాజద్వారంబుల కట్టంబడియు కొన్నిమార్జాలోరగ దంష్ట్రలబడి మొఱలు బెట్టుచు నివ్విధంబులైన క్లేశంబులంబొందుచు నాశంబునొంది యనంతరంబ.

* మృగపశు జన్మము. *

కం॥ జగతీవరనాయకపశు * మృగయోనులయందుబుట్టి * మెలగెడిదుష్క
ర్మగులైనమూఢబుద్ధుల * యగణితదుఃఖములతెరగు * లవిరొచిగింతుర్ ॥

వ॥ శృంగయుతంబులైకొన్నియు దంష్ట్రాన్వితంబులై కొన్నియు చరణనఖాయుధంబులైకొన్నియు ప్రభవించి కొన్నిమనుజుల మోయుచుండు కొన్ని భారవాహులైయుండు కొన్నిమదగర్వంబులైయుండి యన్యోన్య శృంగంబులంగదిశియు శిరంబుల ఢీకొనియు కొరలందలపడియు చరణనఖాయుధంబుల డగ్గరియు బోరాడుచుండు కొన్నిహలంబులు వహించి దున్నుచుండు కొన్నిమాంసాశనులైన దురాత్ములచే భుజియింపంబడుచుండు కొన్నిపికుకుచుండు కొన్నియడవులలో నీరంబుల ద్రావుచు ఫలమూలంబులు భక్షింపుచు కొన్ని మంచులు

ద్రావుచు బ్రతుకుచుండు కొన్ని దుర్బలులను భక్షించుచుండు కొన్ని కామమోహితులై జాతిభేదంబు లెరుంగక రమియించుచుండు కొన్ని గృహద్వారంబుల పాశబంధంబులైయుండు కొన్ని మాంసార్థంబు హింసింపంబడుచుండు కొన్ని తోత్రవేత్రాదులచాతం గొట్టంబడుచుండు కొన్ని సీతవాతాతపక్లేశంబులై తృణంబులును మాంసంబులును భక్షించుచుండు కొన్ని స్వజనంబుల విడిచి క్రయవిక్రయంబులచే పరదేశంబులంబొంది పరులచే బాధింపంబడుచుండు నివ్విధంబున బూర్వసంచిత దుష్కర్మంబులనుభవించి మృతిబొంది శత సంఖ్యలు గోట్లసంఖ్యలునైన జన్మంబులు దాల్చుచు తుదంతంబున దైవయోగంబున బూర్వజన్మ సుకృత బువలన మానుష్యంబునొందు.

* మనుష్య జన్మము. *

గీ॥ నృకకుంకోత్తమయుత్కృష్టనీచకర్మ ♦ లైనయాజంతువులు బహుయోనులందు
బుట్టుచుండునుదుష్కర్మపుణ్యకర్మ ♦ యుక్తులగువాని నెరిగింతుయొనరవినుము॥

గీ॥ అనఘయుత్కృష్టులాస్వజులగుదురవని మధ్యములు బాహుజులటండ్రుమానివర్య
లధములూరుజులగుదురైయధములైన నరలితులకంటెయధములాచరణభవులు

సీ॥ మనుజేంద్ర క్రూరకర్మముల చెగొందరు ♦ శిల్పికర్మకులును చిత్రకరులు
రజకులుకుంభకారకులు సౌవర్ణకుల్ ♦ లోహకారులునటులునుకువిందు
లుసుపాలక సులువ్యాధులునుగిరాతులు పుళిందులువైణులునుమ్లేంఛకులమువారు
కొంకణుల్ కాంభోజకులు పారసీకులు ♦ నాంధ్రులుగుజ్జలులారెవారు

గీ॥ ద్రావిడులుచోర పాండ్యతురత్యతతులు ♦ నావికులునాదిగా గణనావిధైక
జనములగుచునునీచ వంశమునబుట్టి ♦ మెలగుచుందురు సకలభూతములలోన॥

ఉ॥ పొందినకర్మశేషమున ♦ బుట్టుచునుందురుకొందరంధులై
కొందరుకుష్ఠులైజడత ♦ కొందరుకొందరుహీనదేహులై
కొందరునూగలైమరియు ♦ కొందరుకేవలమందబుద్ధులై
కొందరుషండులైనృపతికుంజర కొందరుమూర్ఖులైభవిన్ ॥

గీ॥ శమనసందనపుణ్యశేషంబువలన ♦ బ్రాహ్మణులునతుర్జ్ఞులు బ్రహ్మవిదులు

దానశీలురునఘులు ధర్మపరులు । నగుచుగొందరుజనియింతురవనియందు ॥

కం॥ అనఘాభూమిప్రవరులగు * జనములుభూనాథదత్త * జనపదములుసం
జనితక్రీడలనేలుచు * ననిశముసుఖయింతురతులి * తానందమునన్ ॥

వ॥ అనిన యమపుంగవునకు గురుపుంగవుండిట్లనియె. పురుషోత్తమా తాప
త్రయంబువలన నర మృగ మీనాహి పక్షిజాతంబులు గర్భస్థ బహిస్థంబు
లగుచు నేకర్మంబుచే బాధింపంబడు దెలుప వేయన్నిన నతనికద్దేవుండిట్లనియె.

కం॥ సకలక్షితీశచూడా * మకుటఘటితనూత్నరత్న * మాణిక్యరుచి
ప్రకరవిభాసితపదాంబుజ * ప్రకటితసత్కీర్తిహార * పాండుకుమారా ॥

వ॥ ఆజన్మమరణాంతంబులైన దేహాకర్మంబులనాకర్ణింపుము.

కం॥ నరపశుజాతులిలంబర * స్వరమార్గామధ్యయుక్త * బంధురలీలా
స్ఫురణక్రీడించుననిశము * నిరవగుమధునత్వమాశ్ర * యించినరేంద్రా ॥

* గర్భ వేదన. *

వ॥ నారీజనంబులకు శుక్లవర్జితంబై శోణితంబు స్తనాశయంబగు పురుషులకు
శుక్లంబు బీజాశ్రయంబై స్త్రీసంగమంబుచే వృద్ధిబొందు శుక్ల వృద్ధిచేపురు
షుండును శోణితప్రవృద్ధంబువలన కన్యకయునగు పురుషుని శుక్లపతనసమయం
బున జీవాంశంబు నారీ గర్భాంతంబునం బ్రవేశించి యొక్క మాసంబున
మయూరపింఛంబునుంబోలె మృదుత్వంబునొంది రెండవమాసంబున నల్పచైత
న్యంబునొంది మల మూత్రాది దోషబద్ధుండై నలుగడలకుం గదలుచుండు
మూడవమాసంబున మత్స్యాకారంబునొందు నాలవమాసంబున హస్తపాదం
బులతోగూడియుండు నయిదవ మాసంబున వృద్ధిబొందు నారవ మాసంబున
జీవ ప్రవేశంబగు నేడవ మాసంబున రోమవృద్ధియగు నెనిమిదవ మాసంబున
నభివృద్ధిబొంది మలమూత్రంబులుగలిగి తన్మలమూత్ర లిప్తుండగుచు విలపిం
చుచు దన్నునిందించుకొనుచు నుండునని యదూద్భవునకు గురూద్భవుండి
ట్లనియె.

గీ॥ పద్మలోచనకృష్ణపాపంబువలన । గర్భగతుడగుచునుండి యేకరణిదన్ను

దానెన్నిం దించకొనియె విధంబుననువి ♦ లాపమొనరించుదెలుపవే లాలితముగ

వ॥ అనిన నమ్మహీశునకు నమ్మహాత్ముండిట్లనియె.

కం॥ మలమూత్రాదుల చేసం * కలితాంగుండగుచు దేహి * గర్భగతుండై
విలపించువిధంబులు నే * దెలిపెద వినవయ్య * వసుమతీవరతిలకా ॥

గీ॥ అహహా పూర్వ భవములందు కళత్రపు ♦ త్రార్థమన్యధనముల హరించి
కలుషబుద్ధినైన కతన నీ మాతృగ ♦ ర్భంబు నాకు నిపుడు ప్రాప్తమయ్యె ॥

వ॥ అని వితర్కించి.

సీ॥ అన్యకాంతాకేళి నభిలషించితిగాని ∮ పరకాంత తల్లిగా నరయనైతి
దుష్టాత్ములగువారితో జరించితిగాని ∮ శిష్టసాంగత్యంబు సేయనైతి
ఆచారహీనతలాచరించితిగాని ∮ యురుసదాచారినై యుండనైతి
యనిశంబు ననృతవాక్యములె పల్కితిగాని ∮ పలుకు సత్యంబె కా పలుకనైతి

గీ॥ కటకటా యింక నెన్నడో కఠినపూర్వ ∮ జన్మకోటిపరంపరా జనితభూరి
కలితసంప్రాప్తదుర్భరాగర్భవివర మోచనముగాంచి హరి గొల్చు ముక్తిగనట

వ॥ అయ్యిట్లు చింతించుచు బలవరించు గర్భగతుండైన దేహి ప్రసూతికాల
వాయువశంబున జననికి నసమానవేదన నొనరించుచు యోనియంత్రపీడితుండై
యట్టకేలకు పుడమిం బడి బాహ్యవాయు సంస్పర్శన నెరుక లేక కావు కావు
రని మొఱలిడుచు దైవవశంబున బ్రతుకుచు తదీయక్లేశంబు చెప్పశక్యముగా
దాకర్ణింపుము.

కం॥ నిజమలమూత్రంబులచే * నజస్రము విలిప్తదేహు * డైమంచముపై
నిజముపడియుండు నశక * వ్రజమర్మమక్షికలుగగన * వసుధాధీశా॥

వ॥ అనిన ధర్మసూనుం డాశ్చర్య కందళిత హృదయారవిందుండై గోవిందునకు
నమస్కరించి యిట్లనియె స్వామీ జగత్కర్తవైన నీవు మాదృశాదులకు గతివి
నీవె కావున నన్ను గృపజూచి బాల్య యవ్వన వార్ధక్యంబుల నెత్తెరంగున
వర్తించు దెలుపవే యనిన నమ్మహీపతికి రమాపతి యిట్లనియె॥

కం॥ విను దేహులచే బాల్యం * బనుజ్వలయవ్వనత్వ * మునవృద్ధత్వం
బున నెద్దిసేయబడునది * అనఘా వివరింతు నీకు * నతివిశదముగన్ ॥

### * బా ల్యా వ స్థ *

కం॥ తనయుడు ఫలాదికంబులు * దనరున్ దెమ్మనినయపుడె * దారిద్ర్యగుణం
బునగోపమెత్తి మొత్తిన * ననఘా పడిపొరలినావు * రని మొఱలిడుచున్ ॥

కం॥ నిరతంబు లేమిచే బుర * బురబొక్కుచునుండు సతికి * పుత్రికలత్రికుల్
తిరముగ గల్గిన నకటా * కరువున దోడావ పంట * గలుగుట కాదే ॥

కం॥ అతినిర్దయుడగు పతియున్ * సతతంబును లేమి బహుళ * సంతానసను
గ్రతయుం గవిసి మెలగునా * సతికొకయావంతయైన * సౌఖ్యము గలదే ॥

సీ॥ కల్లరితనములకై తల్లి గోపించి * చెయ్యెత్తి గొట్టిన చివికిచివికి
గురుజనుల్ శిక్షించుతరి నాకమై * చబుకునవడి వేయ జడిసి జడిసి
చదువనోపక పారి చనిడాగి వేళ్లతో * కుడువ పెరుంగక చాలబడలి బడలి
పిల్లదీపాడుమ పెనగి నుద్దిలచే * గుద్దులబడి కందికుంది కుంది

గీ॥ ధూళిధూసర దేహుడై తూలితూలి * అరయనిచ్చ బనసునియై తిరిగితిరిగి
హృదయమందున నిసుమంత యెరుక లేక * శైశవంబున దేహి క్లేశముల బొందు

### * య వ్వ నా వ స్థ *

వ॥ అంత యవ్వనోదయంబైన ధనార్జన కరుడై.

గీ॥ ఓడబేరమాడి వొడ్లను వంచించి ♦ కృషణవృత్తి గాసి కృషి యొనర్చి
అవధిలేక తిరిగి వ్యాపారములు చేసి ♦ యైన ధనము గూర్చు మానవుండు

వ॥ ధనరక్షణార్థంబు బహుప్రకార ప్రాకారకరణ దక్షుండై యున్న దైవయోగంబున రాజ తస్కర దుష్టవర్తనలచే హరింపంబడి పుత్రమింబడి మూర్ఛిల్లి యట్టకేల కుం దెలసి మోహాతిరేకంబున నెరుకలేక బహుక్లేశసముపార్జితంబైన ధనంబపాయంబు నొందె గాసియనుచు వెండియు నుపార్జనోపాయం బెరుంగంగా యనియు నన్యజన సముదయ ద్రవ్యసమభ్యుదయంబున కంతరాయంబు లేదు గానియనియును చివికిచివికి చింతాకులస్వాంతుడై ఆధ్యాత్మికాదిదుఃఖంబులం బొందుచుండి అంత వృద్ధత్వంబు బొందు.

* వార్ధక్యావస్థ *

గీ॥ పలుకకుందురు పలుమారుబిలువపిలువ ♦ కొడుకులైననుకోడలికొమ్మలైన
యేమిజెప్పెదు నత్యంతహేయమూల ♦ మైనముదిమిశరీరియందలమినపుడు

వృ॥ సకలవ్యాధికరంబు భోగచయ ♦ వాంఛాదూర మాకుంచితాం
గకమాచ్ఛాదిత నేత్రవైభవము ♦ శృంగారావిలీలాకళా
నికటాపాయ ముపాయశూన్యము ♦ సముస్నిద్రాతి హేయాకరం
బకటామానవరాజికీ ముదిమి ♦ పాయంబేమి గావింపదే

వ॥ ఇట్టివార్ధకంబునొంద్ది.

క॥ కడతేసియాసకొడుకుల * బడలికలకువగచుగాని * పరసౌఖ్యములిం
పడరజన్నియించుతెరువులు * దడవడునరుడజ్ఞుడగుచు * నవనీనాథా

* మరణావస్థ *

వ॥ అంత కర్మవశంబున బంచత్వంబునొంది.

క॥ యమభట బాధలబడుచుఁ * గ్రమమునధారుణికివచ్చి * కిల్బిషరబహుజ
న్మములెత్తిచనుచుబుట్టుచు * శమనాత్మజతిరుగుచుండు * జనుడఘవృత్తుడై

* కందార్ధము *

(౭౬) * కనరానిదాన్ని శూన్యం * బనియనదగుగానిబయలు * ననదగదుసుమీ *
కనవచ్చుచున్నదింకులో * కనుగొనుటకుయెరుక లేదు * కనుగొనరాదా * ఎరుకనె
శూన్యమనియనరాదా * కనవచ్చెనాలేదా * కనుగొంటివేదాని * యనరాదాభయ
మేమి యనుమానించకుమిదుగో * కనుగొనరాదా యెరుకనెశూన్య మనియనరాదా

కం॥ కనరాదన్నదనుశూన్యము * కనవచ్చినటన్న * జగముగాదది
వెలిగానుభవ వేద్యముబ్రహ్మము * సనకాదిమునిప్రసిద్ధ * సంపగిమన్నా

* కందార్ధము *

(౭౭) * యెరుకబయులందులేమిని * యెరుకనుశూన్యంబటంచు * యెరిగించబడెఁ
యెరుగుమిదెఅకసంబి * క్లైగితెయెరుకాకసములు * యేకామాగదరా * ఆకసము

బయు * లేకా మెల్లారా * పరిపూర్ణ మిగుగో కన్నడు * శూన్యమన గాదు * మొరి గుండు మెదిరిస్తే * ఇక నాచైజా చేప్పు * యే కామాగదరా * ఆకసమూ బయు లేక మెల్లారా

* కందార్థము *

(౨౮) * కనుపడెడి బయలులోపల * కనుగొన లేద మ్యోమొరుక * గాపున శూన్యం * బనవలసె దీన్నె ఆకస * మనవలసెను దీన * విశ్వమాయా నోయప్పా * యింతకు వేరె మాయాయేదప్పా * కనుకా నెయీ విశ్వమును లేసిదని తెస్స * విన జెప్పనాయను కనబోకుండని పోని * మాయానోయప్పా * యింతకు వేరె * మాయా యేదప్పా ॥

—( శ్రీ శివరామదీక్షితీయమను బృహద్వాశిష్ఠం )—

* అచలబోధ సిద్ధాంతం *

శి మూలం లేని యీగుర్తెరిగే శరీరం । కలలో శరీరం । మేలుకొంటే । తనకు తానే యేమీ లేదు అని । నిశ్చయం వున్నట్టు కావలెనని । నాకు భ్రాంతి కద్దు ।

గు కలిగితే అలాగే అయ్యె । యీ శరీరానికీ మూలం యేమీ లేదు అని । దృఢం వున్నది గదా । కొనకు పరివేశించేటందుకు । స్థానం యేమీ లేదు అని । దృఢం వున్నది గదా వున్న స్థాన నిబద్ధి అనుకోవటం భ్రాంతే కదా ।

శి భ్రాంతే ।

గు నిత్యాకలలో వచ్చిన । యేనుగలు । గుఱ్ఱాలు । లొటపిటలు । వున్నాని ।

శి యేమీ లేవు ।

గు అలాగే । "మూలం లేని యీగుర్తెరిగే శరీరం యేమీ లేదు" । అని । నిశ్చయం వుంటే చాలు । పుట్టని చావనిది । తనకు తానే స్వతసిద్ధమై వున్నది గనక । ప్రయత్నం యేమీ లేదు ।

శి "మూలం లేని యీగుర్తెరిగే శరీరం యేమీ లేదు" । అని । దృఢం వుంటే । యేమిటి చాతప్రయత్నం చెయ్య ।

గు యే ప్రయత్నాలకు మూలం మూలం లేని యీగుర్తెరిగే శరీరమే । కాని । వేరే యేమీ లేదు । సకల కర్మాలకు మూలం । మూలం లేని యీగుర్తెరిగే శరీరమే కాని । రెండోది యేమీ లేదు । పుట్టని చావని బట్టబైలుకు వొకటైనా భ్రాంతి లేదు । భ్రమనూ

మూలంకల । కలకల్పనకాకుంటే । శరీర మేలేదు । గనక । భ్రాంతి లేనే లేదు । యె ప్పుడు శరీరం లేకుంటే । అప్పుడే భ్రాంతి లేదు । గాథాన్నిదలో । "మూలంలేనియా గురైరిగేశరీరం యేమీ లేదు" । గనక । వ్యవహార మే లేదు । శరీరంరాంగానే । కల శిద్ధం । యీకలలో అనేక భ్రాంతులుశిద్ధం । గుతేరుగంగానే । భ్రిమపుట్టుచుంది భ్రిమవలన కర్మాలు చేస్తాడు । రీశరంవలన గుణేరుగుటం । గనుక । కర్మాలుపుడు ఘావి । యీవక-శరీరం లేకుంటే జ్ఞానం లేదు । కర్మాలు లేవు । జ్ఞానానకు । కర్మా లకు । మూలం శరీర మే । యీశరీరానకు । మూలంయేమీ లేదు । యేమీ లేనిశరీ రం యేమిచేసినా యేమీ లేదు । శరీరం చేసినకర్మాలు నిబద్ధిలయితే । గుణేరిగేది సార్వకాలంవుండవలె । కర్మాలుపుండవలె । కర్మాలు జ్ఞానం । రెండూనిబధిలయితే శరీరంశాశ్వతంగాపుండవలె । వుండనేవున్నదనిఅంటే చావకపోవలె । చావనేలేదు అంటే । తద్దినాలుపెట్టకూడదు । తద్దినాలుపెట్టనేలేదుఅంటే । కొడుక్కునొప్పివస్తే తండ్రి మంచంవద్దకూర్చుండి అపదపడవలె । తల్లి ముత్తైదలయివుండవలె ।

శి ఛీ । ఛీ । ఆ ప్రసంగంవిడువండి । యీశరీరానకు మర్యాద లేదు । యేమీ లేనిదిగనక యేమీ లేనిశరీరానకు । యేమీ లేనిశరీర మేమూలం ।

గు మూలంవున్నదిఅని అందరుబాగపడ్డారు । యీశరీరానకు మూలంవున్నదని । అంద రు మోరిగేమాత్రిమేకాని । యెవ్వరిమాట ముందరపడదు । స్వామి భోంచేస్తాడని నైవేద్యాలు చూపెదరేకాని । అన్నిభోంచేయ్యటమే । నిబద్ధిలయితే । భోంచేసే దానికిపెట్టక । బలుపపుగా తికయెందుకుచూపవలె । కేవలంనల్లసరపుగుండుకు యెం దుకుచూపవలె । కట్టెకు యెందుకుచూపవలె । ప్రతిమనిబద్ధిలయితే । ప్రత్యేక్షం గా శరీరంవుండంగా । యెరుక కర్మాలు లేని । రాగిప్రతిమకు యెందుకుచూపవలె రుద్రాక్షకు యెందుకు చూపవలె । శరీరంలేనిది యెందిదిఅని । యెవ్వరికి తెలియక శరీరాన్ని దొరకించుకుంచార్రు । శరీరాన్నిగూర్చి । జ్ఞానభ్రాంతి । కర్మభ్రాంతి । తగి లింది "మూలంలేని యీగురైరిగే శరీరం యేమీ లేదు" । అని । నిశ్చయంగల వారేపరిపూర్ణులు । "మూలంలేనియీగురైరిగేశరీరం యేమీ లేదు" । అని । యీ లాగంటేఅలాగేనడిస్తే । వారికిశరీరంవున్నది । అన్ని విడచినావున్నది । అన్ని చేసినా

వున్నది। కొన్నిదొడ్డవి। కొన్ని చెడ్డవి। అని। మంచివి గ్రహించి। చెడ్డవివిడచినవారికి మరీఘట్టిగావున్నది।

శి ఆలాగైతేయేలాగునడువ।

గు నడిచేది యేమిా।

శి యేమో।

గు అందుకే। "మూలంలేని యీగు రైరిగేశరీం యేమిాలేదు" అని దృఢంవుండవలె

శి యీశరీరానకు। మూలంయేమిాలేదుఅని। తనకుతానేదృఢంవుంచుంది।

గు ఇది దృఢంకావటమే। పరిపూర్ణానుభవము। మూలంలేని యీగు రైరిగేశరీరం ఆవరణంవలెవున్నది। యీఆవరణం వేసేవారేకాని। తీసేవారులేరు। లేనివారు అయితే లేకుండాచేస్తారు వున్నవారుఅయితే। మూలంలేనియీగు రైరిగేశరీరానకు దర్వాజాకు తాళంవేసినట్టు తాళంవేస్తారు। నోట్లోమంత్రంవేసి చేతులో యోని ముద్రచూపుతారు। ఇంతేకాని। వున్నదివున్నట్టు యెవ్వరూసూచనచాయరు। మొద్దులకు ముందరబెడితే భోంచేస్తారు। భోంచేసినట్టు అనుభవం। మూలంలేనియీగురైరిగేశరీరంచాత। అనుభవం కావలెనని। అందరికి అభిలాషకద్దు। మూలంలేని యీగు రైరిగేశరీరంలో కొంచంసత్యమని ఆశపడ్డా। శరీరంయీవత్తుగుంచుంది యీ శరీరంలోకనుకోవలెనని। యీశరీరమేమొరబెట్టింది। విత్తనంవిడువకూడదుఅని కపటవాక్యంవన్నినవారు। భ్రాంతిలేనివారుఅన్నచూరా? శరీరంవలనపుట్టినవి। శరీరంవున్నంతసేపు చప్పట్లుగొట్టి అనేకసంకేతాలుచేతులతో జూచూపుచారు। తప్పు శరీరజన్యం గురైరిగేజ్ఞానం। అజ్ఞానంవలన కర్మాలుపుడుచావి। ఇంతేకాని। శరీరం లేని యీజుట్టబైలుకు। మొకుకాలేదు కర్మాలులేవు। సార్వకాలంవాక్కతీరే।

☞ ఈ శరీరంయెటువంటిది అంటే। సర్వశూన్యం యెటువంటిదో। అటువంటిది శరీరంలేకుంటే యేలాగువున్నదో। ఆలాగే। పరిపూర్ణంవున్నది। అందరూ పరిపూర్ణులేకాని। మూలంలేని యీగు రైరిగే శరీరమనే। ఆవరణంచాత వున్నారు యీఆవరణం అనాయాసంగా కలలోవచ్చినయేనుగ మేలుకొంటే యేమిాలేదు అని తనకుతానేదృఢమైనట్టు। "మూలంలేని యీగు తేరిగే శరీరంయేమిాలేదు"

అసి। దృఢంఆయనా। పరిపూర్ణం తనకుతానే స్వతసిద్ధమై చలించక వున్నది ఈ శరీరంచేత సాధ్యంకాదు। శాశ్వితమైనది హెటాటి। యేమీలేనిది హెటాటి వి త్తనంలేని చెట్టువున్నదిఅని। యవ్వడునమ్మి।

శి యెవ్వడునమ్మును।

గు సన్యాశి యేమీలేనివాడా వున్నవాడా।

శి యేమీలేనివాడే సన్యాశి।

గు సన్యాశికిమూలం యేమీ।

శి శరీరానకు మూలం యేమో అదేమూలం।

గు శరీరానకు మూలంలేదు। సన్యాశి శరీరమేగనక। యేమీలేనిశూన్యమేసన్యాసి

* గద్య *

ఇతి * శ్రీమద్గురు శివరామదీక్షితప్రభావే వేదాంతవిచారణే

భ్రాంతి రహిత ప్రకరణం.

* కం దా ర్థ ము *

(౭౯) * అహమనదుగదాఅచలము * అహమున్నదోలేదోచూడ * దదివిజమేగదా అహమునుబుట్టించదుగద * అహముదయించేటివరకే * అదివున్నదిగదా అహమైవిశ్వ మైనిల్చిందిగదా * అహమెయీముచ్చట్ల * నన్నింట్నెరుగునుగద * అహమెంతాతే నాని యెరిగితెసరిగద * అదివున్నదిగదా * అహమెవిశ్వ * మైనిల్చిందిగదా ॥

కం॥ అహమేతనువిశ్వం * బహమేజీవేశ్వరులన * నహమెతద్వైక్యం

బహమేయహముకుమూలం * బహమణగిననణగునన్ని * యనఘచరిత్రా॥

—( శ్రీ శివ రామ దీ క్షి తీ య మ ను బృ హ ద్వా శి ష్ఠం )—

* అ చ ల బో ధ సి ద్ధాం తం *

గు చలం। అచలం। ఈరెండేకాని। మూడోది వివేకమైనా అవివేకమే। పుట్టనిచావని దానికి। మొదలుకొనా లేనిదానికి। రాకడాపోకడా లేనిదానికి। క్రియాశూన్యమైన దానికి। సార్వకాలం వొక్కతీరుగావున్న దానికి మూలంలేనిది తనకుతానేవచ్చినది

పుట్టనిచావని । తనకుతానే స్వతసిద్ధంగా । మూలంలేని యీగు తెలిగే శరీరం రాకమునుపే । సకలదేశాలయందు । సార్వకాలాలయందు । సమస్తమైనవాస్తువుల యందు । తనకుతా నేస్వతసిద్ధమైయున్నది । యిటువంటిది యేమీ చేయదుగదా ।

శి ఇటువంటిది యేమీ చెయ్యదు । సకలనిర్ణయాలు । యెవ్వరు చేసిరి ।

గు యీపుట్టనిచావనిదానిలోనే । మొదలు యేమీ లేక । కొనకు యేమీ లేక । యీకల లోనే తనకుతా నేవచ్చి । సమస్తనిర్ణయాలు । సకలవినోదాలు । అనేకభాష్యాలు అనంతమైన వేదాలు । శాస్త్రాలు । పురాణాలు । ఇల్లాలు । పట్టణాలు । పల్లెలు అనేకసిద్ధాంతాలు । తనకు మనస్సువచ్చినట్లుగా చేసి । తనకుతానే కొనకు శూన్యం అవుతుంది ।

శి శూన్యమంటేనూ ।

గు యేమీ లేదు । వున్నప్పుడు । నీపేరు యేమీ అని । అడిగేదిక్కు లేదు । అదిపోయిన తర్వాతను । యేదిచూచినా । మన్నుబోసి అంబలి కాచినట్లే । పెరుగు అంబలితాగ బోయితే । బురదమన్ను । వున్నప్పుడు । నీవు యెక్కడనుంచి వచ్చినావు । మళ్ళాను క్కడికిపోయావు । అని । వొక్కడైనా అడుగలేదు । వచ్చినవార్లెల్లా రానూ । వచ్చి తనకార్యాలు చేసుకపోను । వున్నవాండ్లకూ మనకూ । సుఖమైనా దుఃఖమైనా పుట్టనిచావనిదానికి యేమీ లేదు ।

శి తనకుతా నేవచ్చి । నేనువున్నప్పుడు । నీపేరు యేమీఅని । వక్కనాడు అడిగినా అడిగితే । మూలంలేని యీగుతెలిగేశరీరం । నేను । అనుకుంటాడు ।

గు దాందేమోయీ । మనమే కలలో అనేకమైనవి । కన్నుల చూచి । ఫలానిదియిది ఫలానిదియిది । అని । గుర్తుగుచూమాలేనా । అవ్విమనను యెరుగునా । యెరు గవా । కలలోవచ్చినవారితోటి । మనుష్యులతోటి । మనము వ్యవహారంచేసినా నూలేదా । పుట్టనిచావని దానిజాడా । వాండ్లు యెరుగరు । మనము యెరుగము అటువంటివాండ్లమాట । యేమనిబద్ధోయి ।

శి ఛీ । ఛీ । వారెని । వారిమాటలను । నమ్మిన వాండ్లు । చెడిపొయ్యేదే ।

గు అయినా మనం యిటుమొటుంకాంగానే యెమీ లేదు । మనదేభ్రాంతి । పుట్టని చావనిది । యీజోలే యెరుగదు । మూలంలేనియీగు తెలిగేశరీరం । రాకముందు

వున్నప్పుడు । కానరు యేమీలేకపోయినా । సార్వకాలంవాక్యతీరే । అందుకే సార్వకాలం శరీరంలేనివారు । దొడ్డవారు । ఇదేగురుసాంప్రదాయం ।

* గద్య *

ఇతి * శ్రీమద్గురు శివరామదీక్షిత పరిభాషే వేదాంతవిచారణే

పంచవింశతి ప్రకరణం.

* కందార్థము *

౨౫ * ఆవరణమునాకసము * నిరావరణమునచేయునుచు * యాసరిమహాత్ముల్ ఆవరణముమతిగలిగిన * దావరణములేందియుమిత * మని తెల్సుకోరా * యీరెంటిని వేరనికనుకోరా * ఆవరణమునవేసి * రావరణమునుజూచి * యావరణమెడలిన నావాలమాటలే * దని తెల్సుకోరా * యీరెంటిని వే * రనికనుకోరా ॥

శ్లో॥ చతుర్వింశతి నఖాంగుళ్యం । చతురంగుళిముష్టికం ।
షణ్ముష్టికంతుహస్తంచ । హస్తా చత్వారికంధనుః
ద్విసహస్రిధనుః క్రోశం । క్రోశంచత్వారియోజనం
సహస్రయోజనందేశం । దేశంచత్వారిమండలం
సహస్రమండలాఖండం । నవఖండంతుమేదిని
దేశానికి ౧౦౦౦ యోజనాలు । మండలానికి ౪౦౦౦ యోజనాలు । ఖండానికి ౪౦౦౦౦౦౦ యోజనాలు । నవఖండాలకు ౩౬౦౦౦౦౦౦ యోజనాలు

—( శ్రీ శివరామదీక్షితీయమనుబృహద్వాశిష్ఠం )—

అచలబోధసిద్ధాంతం

గు॥ యీగుతేరిగేశరీరం తనకుతానేవచ్చి । తనకుతానే యేమీలేదు । యీపుట్టించావనిబట్టబైలులో । యేమీలేనియీగుతేరిగిశరీరం । వున్నట్టువుండేది । యేమీలేకపొయ్యేది । స్వభావం । దీన్నినిలిపేవారులేరు । తీసివేసేవారులేరు । యేమీలేని బట్టబైలులో యేమీలేని వింత వున్నట్టువున్నది । గురుసాంప్రదాయం వల్ల విచారిస్తే । "మూలంలేనియీగుతేరిగేశరీరం యేమీలేదు" । పుట్టించావనిబట్ట

బైలేవున్నది । సార్వకాలంవొక్కతీరే । గురుమూలంగా । యేమీలేనియీగు తైౖరిగేశరీరం । యేమీలేనుఅని । వినంగానే । అచలం స్వతసిద్ధం । స్వతసిద్ధమైవున్న దానికి । ☞ మూలంలేని యీగు తైౖరిగేశరీరం । ఆవరణంవలె వుండె । గురువు "మూలంలేని యీగు తైౖరిగేశరీరం యేమీలేదు" । అని చెప్పంగానే । పుట్టని చావనిది । మొదలు కొనా లేనిది । రాకడా పోకడా లేనిది । సకలదేశాలయందు సార్వకాలాలయందు । సమస్తమైన వస్తువులయందు । తెనకుతానే । స్వతసిద్ధమై చెలించక । సార్వకాలం వొక్కతీరుగా । శరీరంలేకవున్నది । మూలంలేనియీగు తైౖరిగేశరీరాన్నుంచి । సర్వంతోచింది । యీశరీరంతోటే అన్ని పోవునవి । వున్న దానికి తోచలేదు పోనూలేదు । యేలాగువున్నదో ఆలాగేవున్నది ।

* గద్య *

ఇతి * శ్రీమద్గురు శివరామదీక్షితపరిభావే వేదాంతవిచారణే

భ్రాంతి రహిత ప్రకరణం.

* కందార్థము *

(౮౧) ఆకాశము శూన్యంబని * లోకులు మొరబెట్ట * దానిలోపవనాదుల్ * ప్రాకటముగబుట్టినవని * చికాకుగ జెప్పినారు * ఛీ వినరాదు * వంధ్యాసంతీ * క్షితిలోనలేదూ * కాకుంటేవిను * చోద్యమాగుందేటికి కొమ్మ * యీ కాలముననే మేమేకంటిమనుమాట * ఛీ వినరాదు * వంధ్యాసంతీ * క్షితిలోనలేదూ ॥

* కందార్థము *

(౮౨) లేనెరుకనుబయలందున * లేనేలేదనకయితిరు * లేలపలికిరో * లేనిదికలదని పినపను * లేనేలేదనుచుసిగ్గు * లేకాయీలీలా * ఛీవినకేచీ * కాకూనీకేలా * మేనందశుద్ధాము తానల్లుకొని మళ్లి * పూనీకడిగినరీతి సౌనూశిగ్గోకఖంత * లేకాయీలీలా * ఛీ వినకేచీ * కాకూనీకేలా॥

* కందార్థము *

(౮౩) అన్నపు హూతూన్శమునను * సెన్నగనీరంబు ప్రాణ * మెరుగునుయీరె డెన్నకుగలియవొనాడే * సున్నసుమీ మెరుకమాట * సుగుణాసంపన్నా కలసుటె

యెరుక * సుమియింతకన్నా * వున్నాదెరుకమూల మన్నాది వినలేదు * యెన్నాను యీభ్రాంతి * నిన్నంట నియ్యాకు * సుగుణాసంపన్నా * కలసుంటెయెరుక * సుమి యింతకన్నా ॥

(కం॥) మనుసన్నపు సూక్ష్మాంశము * వినుజల సూక్ష్మాంశవలన * వెలసెను ప్రాణం బును రెండుగలసిపిండం * బన బ్రంహ్మాండంబనంగ * బరగునువత్సా ॥౧౦౭॥

—( శ్రీ శివరామదీక్షితీయమను బృహద్వాశిష్ఠం )—

* అచలబోధ సిద్ధాంతం *

గు "మూలంలేని యీగుతెరిగే శరీరంయేమీలేదు" । గనక । యీయేమీలేనిది తనకుతానేస్వాధీనంకాదు । మందితనవంటివారే । గనక । మందిస్వాధీనంలో లేదు వున్నంతసేపు । పెడితేతినేటందుకుపుట్టింది । సమయంవస్తేయేమీలేను । పెట్టిపెట్టి చెడిపొయ్యేదే కాని । కొనకు యేమీలేదు । మూలంలేని యీగుతెరిగేశరీరం తిన్నంతసేపే । తిండిలేకుంటే । అడ్డంపడే । అందుకే । మూలంలేని యీ గుతెరిగేశరీరం । నేనుఅని । నమ్మివుండరాదు ।

శి నమ్మక యేమిచెయ్య ।

గు "మూలంలేని యీగుతెరిగేశరీరంయేమీలేదు" । అని । సార్వకాలం సంతతం యెడతెగక జ్ఞాపకంవుంచుకొని । కాలంగడిపినవాడే । భ్రాంతిలేనివాడు । వాడే పుట్టనిచావనియీబట్టబైలు । కలలో కొంతనిబద్ధి । కొంతఅబద్ధమని । ద్వంద్వాలు నమ్మినా । అడవిలోకలసి । శోవకుయన్నటికిరాడు । సార్వకాలం । "మూలంలేని యీగుతెరిగేశరీరం యేమీలేదు" । అని నిద్రవచ్చిన దాక । మరణంవచ్చినదాక విడువక । రెప్పపాటులో సఘంకాలమైనా । మరువక వున్నవాడే । బాధమోక్ష రహితుడు । వాడేకైవల్యాశూన్యుడు । వక్కశరీరంయేలాగో । అన్నిశరీరాలుఆలా గే । మూలంలేని యీగుతెరిగేశరీరంలో । కొంచం నిబద్ధిఅని । అనుకున్నవానికి భ్రాంతి పోదు । తిండిఅన్నిశరీరాలకు సమానమే । మనిషికి మాటలు యెక్కువ మూలంలేనియీగుతెరిగేశరీరం । యేదిఅభ్యాసంచేస్తే అది కొందరికి లెస్సఅభ్యా

సంభవుచుంది । కొందరికి కొంచం అవుచుంది । సూక్ష్మబుద్ధికొద్ది । ఇంతేకాని । ఈ శరీరంలో శాశ్వతమైంది కొంచం లేదు । శాశ్వతమైంది మొదలుకొనా లేక । రాకడాపోకడా లేక । శరీరం యెన్నటికి లేక । తనకుతానే । సార్వకాలాలయందు । ఒక్కతీరుగానే । చలించక । స్వతసిద్ధమై యున్నది । సకలదేశాలయందు । ఒక్కతీరుగా వున్నది । సార్వకాలాలయందు । శరీరం లేకనే వున్నది । సమస్తమైనవస్తువులయందు ప్రవేశించక । తనకు తానే । శరీరం లేకవున్నది । శరీరం లేదుగనక । మొదుకా లేదు కర్మాలు లేవు । మూలం లేని యీగుత్తెఱిగే శరీరం రాక మునుపు । మొదుకా లేదు కర్మాలు లేవు । గుత్తెఱిగేదివుంటేగాని । కర్మాలు చెయ్యడు । కలలేకుంటే శరీరాలు లేవు । కలలో శరీరాలు వచ్చినవి । ఆశరీరాలు గుత్తెఱుగు । గనక । సకలకర్మాలు చేసినవి । గుత్తెఱుగకుంటే । కర్మాలు పుట్టుచావే । జ్ఞానాన్ని చేకర్మాలు । కర్మాలకుమూలం । యీగుత్తెఱిగే జ్ఞానమే । జ్ఞానంనిబద్ధి । కర్మాలు అబద్ధమని । యీ కలలోనే మోక్షసన్యాసి । అన్నాడు । ఆసన్యాసి అప్రమాణికుడే । మేలుకొంటే ఆసన్యాసియేమీ లేదు । యీగుత్తెఱిగేజ్ఞానం యేమీ లేదు ।

* గద్య *

ఇతి * శ్రీమద్గురుశివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే

భ్రాంతిరహిత ప్రకరణం.

* గద్య *

ఇతి శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వ

శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక

సదృష్టాంతక ప్రకాశిక యందలి మొదుకోత్పత్తి లక్షణంబను

పంచమోధ్యాయము.

శ్రీగురుభ్యోనమః

శ్రీమద్భాగవత కృష్ణదేశిక విరచిత శక్తిద్వయ నిరాసకంబైన,

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

( మెరుకను విడిపించుట. )

* కంధార్థము *

(౧౮) పిల్లలుతాతయ్యకులతో * పిల్లలగావించి పెండ్లి * పేరంటంబుల్ * కొల్లలుగ జేయువారల * తల్లులుగనిసత్యమనుచు * దలచేరామదినీ * నినుసీవిట్లు * దలుచార మదినీ * కల్లాసంసారాముగని * మానవులుసంత * సిల్లాగగురుమంత్ర * సిద్ధాలు నిజమని * తలచేరామదినీ * నినుసీవిట్లు * దలుచారమదినీ ॥

కం॥ పురుషోత్తముడనిపూజలు * నరులొనరింపుదురుభువిని * నానాచోట్లన్
ధరమొదలగుభూతములను * చిరుతశిశువులాడుకొనెటి * చేష్టలరీతిన్ ॥

* కంధార్థము *

(౧౯) మేనెరుకలరెండిటిలో * దానినిదిది దీనినదియు * తగస్పృజియించున్ * మేనెరుకలివియు మూలము * లేనిదెస్పృజనమ్యో ననుచు * లేనెలేవంటి * అంట్లెతప్పా లేనేలేదంటీ * మేనెరుకలిప్పుడు * దేనందున్నవొచూచి * లేనిమేనెరుకాల * లేని వనుచునమ్మ * లేనేలేవంటీ * అంట్లెతప్పా * లేనేలేదంటీ ॥

—( శ్రీ శివరామ దీక్షితీయమను బృహద్వాశిష్ఠం )—

* అచలబోధసిద్ధాంతం *

౫ మూలంలేని యీగు తెఱిగేశరీరమే । విక్షేపశక్తి । యీవిక్షేపశక్తే ఆవరణశక్తి విక్షేపంలేకుంటే ఆవరణాం పాయ । ఆవరణాంపోతే విక్షేపం పోదు । విక్షేపశక్తి ఆవరణాకుమూలం । విక్షేపంచ్చాతనే । అనేకఆవరణాలువస్తావి । అందుకే । గురు సాంప్రదాయం । మూలంలేని యీగు తెఱిగే శరీరంలేని సాంప్రదాయం కానలె సకలభ్రమలకుమూలం । మూలంలేనియీగు తెఱిగేశరీరమే । అందుకే "మూలం లేని యీగు తెఱిగే శరీరం యేమీలేదు" । యింతకంటేఅధికంలేదు । యిదేగురు వాక్యం పరిపూర్ణం । పుట్టనిచావనిది । మొదలుకొనాలేనిది । రాకడ పోకడా లేనిది । సార్వకాలం క్రియా శూన్యమైనది । సకలదేశాలయందు । సార్వకాలాల యందు । సమస్తమైనవస్తువులయందు । చలించక తనకుతానే శరీరంలేక । స్వత సిద్ధమైయున్నది । గనక । అందుల ప్రయత్నంలేదు ।

* గద్య *

ఇతి * శ్రీ మద్గురు శివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే

భ్రాంతిరహిత ప్రకరణం.

* కంధార్థము *

౪౬ మొదకపని జేయుదనకుము * మొగుట మరుమటలు రెండు * మొవ్వరిపనులో మెరిగింపుము నామోలను * వెరవనుతప్పితివదెబ్బ * వేశేనుచూడూ * అట్లనకుండ జేశేనునేడూ * వెరిపించుడేదెబ్బ * వేశేనానాతండ్రి * మొరిగించిపైమర్మ * మొరు కానునేదిశి * వేశేనుచూడూ * అట్లనకుండ * జేశేను నేడూ ।

—( శ్రీ శివరామ దీక్షితీయమను బృహద్వాశిష్ఠం )—

* అచలబోధసిద్ధాంతం *

ధర్మాధర్మ నిరసన ప్రకరణం.

శ్లో॥ చిదేవదేవా శ్చిదిమేవలోకా । శ్చిదేవభూతాని చిదింద్రియాణి
కర్తాచిదంతః కరణంచిదేవ । చిదేవసర్వంపరమార్థరూపం ॥

శ్లో॥ చిదేవాచిస్త్రిచిన్మాత్రి । మిదంచిన్మయ మేవచ
చిత్వంచిదహం మేతేచ । లోకాచిదితిసంగ్రిహః ॥

శ్లో॥ చిదేవపంచభూతాని । చిదేవభువనత్రియం
విజ్ఞానమధునాసంవ్య । ఖహంమస్మిచిదేవహి ॥

శ్లో॥ చైతన్యం శాశ్వితం శాంతం । వ్యోమాతీతం నిరంజనం
నాదబిందుకళాతీతం । తస్మైశ్రీగురవేనమః ॥

విచారణ

సిద్ధోహం । బుద్ధోహం । హంసోహం । అహంబ్రహ్మాస్మి ।

జీవేశ్వరైక్యజ్ఞానం । జ్ఞానమేపరబ్రిహ్మాస్వరూపం । జ్ఞానమేపరమాత్మ గుర్తెరిగేది నేను

౧ నేనుగుర్తెరిగేది యెక్కడవున్నదో అంటే అది పరోక్షజ్ఞానం

౨ నేనుగుర్తెరిగేది యిక్కడవున్నది అంటే అది అపరోక్షజ్ఞానం

3 నేనుగుర్తెరిగే ప్రకృతిని అంటే సాక్షాత్కారం

జ్ఞానంకంటె దొడ్డది లేదు । గుర్తెరిగేది జ్ఞానమని । సదివుపనిషత్తులయందు । చెప్పు చూవున్నవి । సాక్షిఅంటె గుర్తెరిగేవాడు । సాక్షిసిఅంటె । గుర్తెరిగే చైతన్య స్వరూపిణి । సాక్షివర్జితమంటె । మాయారహితం । అవిద్యారహితం । ప్రికృతి ద్వయరహితం । క్షరాక్షరోపాధి ద్వయదోషరహితం । ప్రికృతిద్వయానికేజగత్తు తోస్తుంది । ప్రికృతిద్వయరహితునికి యేలాగుతోస్తుంది । వున్నదానికి వున్నదితో స్తుంది । లేనిదానికి లేనిది లేనేలేదు । పుట్టని చావనిది కేవలాత్మ । పుట్టేది చచ్చేది ప్రకృతిద్వయం । యిదిలేకుంటే చావనిది పుట్టనిదే వున్నదివున్న । రెండువన్నిచెప్పితే సత్యద్వయం । రెండువున్నవని చెప్పరాదు । లేనిది యెప్పుడూ లేదు వున్నది యె ప్పుడూలేకపోదు । యిదేవిచారానకుఫలం । పుట్టనిచావనిదే వున్నది । ప్రకృతిద్వ యరహితమే అనుభవం । అనుష్ఠానంలేదు । విచారణమే కారణం । ప్రకృతిద్వ యమేఅనుష్ఠానం చేసేది । విచారించేది ప్రకృతిద్వయం । ప్రకృతి ద్వయం లేదని నిశ్చయ పర్యంతరం విచారించవలెను సార్వకాలం ప్రికృతిద్వయ రహితమే మానం ।

* ఉపాధిద్వయదోషరహిత లక్షణం *

ఉపాధిద్వయదోషరహితమె నాడి
ఉపాధిద్వయదోషరహితమె మైలి
ఉపాధిద్వయదోషరహితమె సుజ్ఞానం
ఉపాధిద్వయదోషరహితమె మహాపూజ
ఉపాధిద్వయదోషరహితమె యాత్రాఫలం
ఉపాధిద్వయదోషరహితమె జన్మరాహిత్యం
ఉపాధిద్వయదోషరహితమె తీర్థం
ఉపాధిద్వయదోషరహితమె ప్రసాదం
ఉపాధిద్వయదోషరహితమె సిద్ధి
ఉపాధిద్వయదోషరహితమె గురుపూజ
ఉపాధిద్వయదోషరహితమె లోకాతీతం
ఉపాధిద్వయదోషరహితమె యింద్రియజయం
ఉపాధిద్వయదోషరహితమె నియమం
ఉపాధిద్వయదోషరహితమె స్వస్త్రీవర్జితం
ఉపాధిద్వయదోషరహితమె పురుషరహితం
ఉపాధిద్వయదోషరహితమె అఖండైశ్వర్యం
ఉపాధిద్వయదోషరహితమె అకర్తృత్వం
ఉపాధిద్వయదోషరహితమె అభోక్తృత్వం
ఉపాధిద్వయదోషరహితమె క్రియాశూన్యం
ఉపాధిద్వయదోషరహితమె నిర్గుణం
ఉపాధిద్వయదోషరహితమె గుణాతీతం
ఉపాధిద్వయదోషరహితమె ఉత్తమం
ఉపాధిద్వయదోషరహితమె బీజరహితం

ఇతి గద్య * శ్రీమద్గురు శివరామదీక్షితప్రభావే వేదాంతవిచారణే
ధర్మాధర్మ నిరసన ప్రకరణం.

* కం దా ర్థ ము *

(౮౭) లేనికల గలిగినప్పుడు * దానికి దశదిశలయందు * తగ మొదటకొనల * తానంటుకున్న మేల్కను * లేనిక లేచూచె నేని * లే కాపోవుగదా * కలతో మేల్క * లేకా పోదుగదా * లే నెరుకి బయలులీ లీలాగని కెపుడు * గానావచ్చి తెబోధ * గావా లెనన వపుడు * లేకాపోవుగదా * కలతో మేల్క * లేకాపోదుగదా ||

* కం దా ర్థ ము *

(౮౮) వాంటుకు దాపల బిందోగ * ట్లంటించినకొలది లెఖ్ఖ * అధికంబగునా * వాంటు కువలపలబిందోక * టంటించిన లెఖ్ఖ * వృళ్ళకొగదనోయీ * వాంటుండి లేం * దాగ దనోయీ * తంటాదీరును చూడు * దానివలెనె మెరుక * కంటెబయలును తాను * గలి గుండి తనకుళ్ళ * కొగదనోయీ * వాంటుండి లేం * దాగదనోయి ||

౦౧౦

* కం దా ర్థ ము *

(౮౯) మెరుకొక్క టుండెనేనియు * మెరుకే యీవిశ్వరూప * మేర్పడ దాల్చక మెరుకొక్కటి లేకుండిన * మెరునైన ప్రపంచమున్న * దెవరెరిగెరికను * లేదనన్నైన నెవరుండెరికను * పరిపూర్ణమైనట్టి * బయలుండగని పెట్టి * గురునివాక్యము బట్టి గుఱుతు బోగొట్టితె * యెవ రెరిగేరికనూ * లేదనన్నైనా * నెవరుండేరికనూ ||

* స దా నం ద యో గి శ త క ము *

సీ|| కలదుకలదన్న వారికి కలదు జగము । లేదు లేదన్న వారికి లేదు జగము
కలిమి లేములు మాయకు కలగుణములు । నవ్యతరభోగి శ్రీసదానంద యోగి ||

* కందార్థము *

(౧౦) తెలుపుమృదుత్వముమధురము * గలవస్తువుచక్కెరనుచు * గనుగొన్నట్లా
తెలివిశరీరజగంబులు * గలవస్తువుబిందువనుచు * గనుగొనరాదా * నేజెప్పితె * విని
నమ్మరాదా * తెలిపిచేబయలుండదెలశి * యీతెలివిని * తెలివిచాతనెబట్టి * తీశి
వెయ్యరపోని * కనుగొనరాదా * నేజెప్పితె * వినినమ్మరాదా ॥

* అమృతబిందూపనిషత్ *

హరిః ఓం ॥ మనోహిద్వివిధంప్రోక్తం । శుద్ధంచాశుద్ధమేవచ । అశుద్ధంకామ
సంకల్పం । శుద్ధంకామవివర్జితం । మనఏవమనుష్యాణాం । కారణంబంధమో
క్షయోః । బంధాయవిషయాసక్తం । ముక్తిర్నిర్విషయంస్మృతం । యతోనిర్వి
షయస్యాస్య । మనసోముక్తిరిష్యతే । అతోనిర్విషయంనిత్యం । మనఃకార్యం
ముముక్షుణా । నిరస్తవిషయాసంగం । సన్నిరుద్ధంమనోహృది । యదాయా
త్యాత్మనోభావం । తదాతత్పరమంపదం । తావదేవనిరోద్ధవ్యం । యావద్వృత్తి
గతంక్షయం । ఏతజ్జ్ఞానంచధ్యానంచ । శేషోన్యాయశ్చవిస్తరః । నైవచిం
త్యంనవాచింత్యం । నచింత్యంచింత్యమేవతత్ । పక్షపాతవినిర్ముక్తం । బ్రహ్మ
సంపద్యతేతదా । స్వరేణసంధయేద్యోగ । మస్వరంభావయేత్పరం । అస్వ
రేణానుభావేన । నాభావోభావఇష్యతే । తదేవనిష్కళంబ్రహ్మ । నిర్వి
కల్పంనిరంజనం । తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా । బ్రహ్మసంపద్యతేధృవం
నిర్వికల్పమనంతంచ । హేతుదృష్టాంతవర్జితం । అప్రమేయమనాదించ
యజ్జ్ఞాత్వాముచ్యతేబుధః । ననిరోధోనచోత్పత్తి । ర్నబద్ధోనచసాధకః । నము
ముక్షుర్నవైముక్త । ఇత్యేషాపరమార్థతా । ఏకఏవాత్మామంతవ్యో । జాగ్ర
త్స్వప్నసుషుప్తిషు । స్థానత్రియవ్యతీతస్య । పునర్జన్మనవిద్యతే । ఏకఏ
వహిభూతాత్మా । భూతేభూతేవ్యవస్థితః । ఏకధాబహుధాచైవ । దృశ్యతేజల
చంద్రవత్ । ఘటసంవృతమాకాశం । నీయమానేఘటేయథా । ఘటోనీ
యేతనాకాశం । తద్వజ్జీవోనభోపమః । ఘటవద్వివిధాకారం । భిద్యమానం
పునఃపునః । తద్భగ్నేచనజానాతి । సజానాతిచనిత్యశః । శబ్దమాయావృతో

నైవ । తమసా యాతి పుష్కరం । భిన్నే తస్మిన్ చైకత్వ । మేకమేవానుపశ్యతి
శబ్దాక్షరం పరం బ్రహ్మ । తస్మిన్ క్షీణే యదక్షరం । తద్విద్వానక్షరం ధ్యాయే
ద్యదిచ్ఛేచ్ఛాంతిమాత్మనః । ద్వేవిద్యే వేదితవ్యేతు । శబ్దబ్రహ్మపరం చయత్
శబ్దబ్రహ్మణినిష్ణాతః । పరంబ్రహ్మాధిగచ్ఛతి । గ్రంథమభ్యస్య మేధావి
జ్ఞానవిజ్ఞానతత్పరః । పలాలమివధాన్యార్థీ । త్యజేద్గ్రంథమశేషతః । గవామ
నేకవర్ణానాం । క్షీరస్యాప్యేకవర్ణతా । క్షీరవత్పశ్యతేజ్ఞానం । లింగినస్తు
గవాంయథా । ఘృతమివపయసినిగూఢం । భూతేభూతేచవసతివిజ్ఞానం । సత
తంమంథభంగంచ । మనసమథానభూతేన । జ్ఞాననేత్రంసమాధాయ । ఉద్ధరే
ద్వహ్నివత్తత్పరం । నిష్కళంనిశ్చలంశాంతం । తద్బ్రహ్మాహమితిస్మృతం
సర్వభూతాధివాసంవ్యద్భూతేషుచవసత్యపి । సర్వానుగ్రాహత్వేనా తద
స్మ్యహం వాసుదేవ స్తదస్మ్యహం వాసుదేవఇతి ॥

హరిహిఓం తత్సదితి అమృతబిందూపనిషత్సమాప్తః

గోడమాణిక్యశుభ్ర । పదార్థమాత్రపరకచీసాఖర । తద్వత్ సచ్చిదానందవస్తు
పతూలశుభ్ర । అతికోమలఖండశర్కరా । తద్వత్ సచ్చిదానందవస్తు । తద్వత్
సత్యజ్ఞానానందవస్తు ॥

* కందార్థము *

(౯౧) లేనెరుకబయలుబోవల * తానైతనకేరుపడిన * తనమూలము నే * తానెరుగ
దలచినప్పుడు * తానేలేకుండుదృష్టాంతమువినుమిచటా * కలదోచూడెద * తనకై తా
నెచటా * తానైచినకలతనమేలగనబోతె * తానేతనకులేకతగియున్నాది
దృష్టాంతమువినుమిచటా * కలదోచూడెద * తనకై తానెచటా ॥

* కందార్థము *

(౯౨) చచ్చుటపుట్టుటమేలుక * వచ్చుటగాభాసుషుక్తి * వచ్చుటలివినా * ల్గచ్చ
ముగసహజమెరుకకు * పొచ్చముయీరెరుకనిల్వ * బోదూనాయుప్పా * అచల
ముకిట్లు * లేనుగదప్పా * మచ్చికతోరెంటిమర్మముసేకిప్పు * దెచ్చాగదెలిపితి నెరు
గుమెరుకనిల్వ * బోదూనాయుప్పా * అచలముకిట్లు * లేదుగదప్పా ॥

రర శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సద్వృష్టాంత ప్రకాశిక.

* కందార్థము *

(౯౩) మెరుకనుకలలో పురుషుని * కెరుకేయీ విశ్వమగుచు * యేర్పడుకలగా * మెరుకబయలుగనితాలేం * దెరిగిన నెరుకకది మేలు * యిదినమ్మలెస్సా * మెరుకతో పొందు * వదులా దెపిస్సా * మెరుకా నెకలసీకు * మెప్పూడుదోచితె * మెరుకాలే దనుమేలు * నెరుగూ పష్పెడెచాలు * యిదినమ్ములెస్సా * మెరుకతో పొందు వదులా దెపిస్సా ॥

* కందార్థము *

(౯౪) చిత్తగుప్రరంగుగోడల * నెత్తెరగున దెలశినావో * నీవిప్పుడునీ * చిత్తమున జగము నెరుకను * వృత్తబయల్ నట్లు దెలియు * మూహాత్మోమతనూ * తెలశివిమప్ర మూహాజగములనూ * అత్తెరగున జేస్తె ఆవాలిమాటాను * యిత్తెరగని తెలియు * నెవరుం డేరటుమీద * నూహాత్మోమతనూ * తెలశివిమప్ర * మూహాజగములనూ ॥

* కందార్థము *

(౯౫) పరిపూర్ణములో లేనిదె * మెరుకొకటిదోచితనను * యెరిగినమృషగా మెరుకేవిమచునదెట్లన * కరముబుతమపనులుతామె * గడుపూనట్లుగనూ * యిదిగాకుంటె * కలదింకోటివినూ * మరికావిదా మాట * మంచీదీమాటాని * పరిపారివిధమూల * పలుకేపలుకులపని * గడుపూనట్లుగనూ * యిదిగాకుంటె * కలదింకోటివినూ ॥

* ఆనందానుభవము *

ద్విపద

అనియుపదేశింప యాశిష్యవరుడు । తననిజరూపంబుతానిశ్చయించి
ఆనందరూపుడై యాలగుసద్గురుని । నానావిధములవర్ణన చేసిపొగడి
గగనంబులోపలి ఘటము చందమున । మొగినిజాంత బాహ్యమునపూర్ణుడగుచు
సరసిలోపలికలశంబు చందమున । పరగలోపలవెలుపల పూర్ణుడగుచు
శాంతుడై చిద్విలాసమునవర్తిలుచు । మంతనంబునతనమమనసీక్షించి

మనసరాగదవేసీమహిమలెంచెదాను । మునుసచ్చిదానందమునునద్వయంబు
అనఘుమైనట్టిబ్రహ్మమునందునీవు । కనుగొనలేక నేకలిగివెలుగుచును
యీశ్వరుకామించియిచ్ఛలుగరపి । విశ్వముల్ గల్పించివివిధవాక్యముల
జీవులబుట్టించిజీవులనెల్ల । భావింపగుణపాశబద్ధుల జేసి
సంతతసంసారజలధిముంచితివి । యింతవింతైననీయింద్రజాలంబు
యండమావులనీరుయలశుక్తికను । వెండిరజ్జువునదర్వీకరాంగంబు
పురుషుండు మొద్దునబొందోచినటుల । పరమాత్మయందుప్రపంచంబుదోచె
నాపుణ్యవశమున నాగురుస్వామి । చేపట్టియీకీలుజెప్పిసత్కృపను
వేగ దేహాధ్యాసవిడిపించగాను । బాగుగాదెలసితిపరమాత్మవిధము
మానున జేసినమదకరికల్ల । యైన తెరంగునఆత్మనుదెలియ
జగముసత్యంబౌటసందేహమేమి । వగలకారిమనంబపదలుమింతటను
నిలిపెదననిన్ను నిగ్రహించినను । ధరకుక్కతోకను బద్దలుగట్టి
అరుగుగాబిగియింపనదిచక్కనగునె । నిజాపవిషతువానినుబట్టినాను
నీజోలినాకేలనీవునాకేల । అనియానతిచ్చినా యామనస్సనియే
యిక నేమిచేయుదు మెచటికేగుదును । తెరతెరజెడితినా తెరగెల్లదప్పి
ఆనీటమున్నిగినీరైనట్టిలవణ । మునుబోలెయమ్మహాత్ముని యాత్మయందు
మనసులయంబయ్యెమాటమాత్రమున । ఘనతేజమందుచీకటియాలినిలుచూ ॥

# యోగవాసిష్టం

* సప్తభూమికలు *

సీ॥ జననాధయెరుగు మజ్ఞానభూమికలేడు । పొలుపొందుమనమూర్ బూని వెలుగు
యీరెంటిసంధుల నేపారుభూములు । గణనకుమిక్కిలి గలిగియుండు
నవిబంధమూలంబులై ఫలియింపుమ । జెప్పంగబడియె సంక్షేపభంగి
ముగినిరాగద్వేషములబాసి శుద్ధసం । విన్మాత్రచిత్తంబు విడువనీక

గీ॥ జాడ్యనిద్రలుడిగి సంకల్పముల శాసి । శిలయుబోలెనొందు దలపులేక
వస్తువస్తుమధ్య వర్తియై వెలుగొందు । నదియె చిత్స్వరూప మనగబరగు ॥

వ॥ అందునారోపితంబులగు జ్ఞానభూమిక లెవ్వియనిన బీజజాగ్రత్తును జాగ్రత్తును మహాజాగ్రత్తును జాగ్రత్స్వప్నంబును స్వప్నంబును స్వప్నజాగ్రత్తును సుషుప్తికంబుననంబను నివియొండొంటిం గలసి యనేకనామంబులైయుండు దల్లక్షణంబు లెఱింగించెద.

* బీజజాగ్రత్తు *

గీ॥ చిత్తునకు దాన మొదలిటి చేతనంబు । నైయ్యసాంఖ్యంబు విమలంబునై నెఱుంగు
భంగి జిత్తాత్మజీవ సద్భజనమునకు । ప్రథమబీజంబు బీజజాగ్రత్తుభూమి ॥

వ॥ యిది యెఱుకకు నూతనావస్థయనంబడు నింక జాగ్రదవస్థ జెప్పెద వినుము.

* జాగ్రత *

కం॥ యిది నాయిల్లిది నామే * నిది రేబగలని తలంచు * నెఱుక విశదమై
మది బొడము ప్రాగభావం * బది జాగ్రత్తనగ నొప్పు * నకలంకులేశా ॥

* మహాజాగ్రత *

గీ॥ యితడు నతడును నేను యిది నాయిదనగ జ । న్మాంతరములవచ్చునట్టి యెఱుక
అనఘ చెరిత యెసగు మది మహాజాగ్రత్తు । అనిరితత్త్వవేత్తలైన మునులు

* జాగ్రత్స్వప్నం *

కం॥ యీరాజును గొలచిననే * నీరాజ్యమునందునుందు * నొండొకదండన్
గోరుట జాగ్రత్స్వప్నం * భారమనోరాజ్యమహిమ * లదుటరామా ॥

* స్వప్నం *

గీ॥ యెండమావులుదక మిరువురు చంద్రులు । కప్పచిప్ప వెండిగా దలంచి
పెక్కుగతుల భ్రాంతి బెరయుట స్వప్నంబు । రఘుకులాబ్ధిచంద్ర రామచంద్ర

* స్వప్నజాగ్రత *

గీ॥ పెద్దగాల మేనిదద్దయు దరుచగా । జూడకుండి పిదప జూచి తెలియు
జ్ఞానమదియు స్వప్నజాగ్రత్తు నామంబు । అనిరి బోధవేత్తలైన మునులు ॥

* సుషుప్తి భూమి *

కం॥ జడమొందియుపుడు జెప్పిన * షడవస్థలు దొరగి దుఃఖ * జాలము మదిలో
బొడకాపి భావి దుఃఖము * బొడగనుఁ డియును సుషుప్తి * భూమియు లేశా ॥

వ॥ విజ్ఞానభూమికలెవ్వియనిన ప్రథమంబును శుభేచ్ఛయు ద్వితీయ్యంబు విచారణ
యు తృతీయ్యంబు తనుమానసంబును చతుర్థంబు సత్వసంప్రాప్తియు పంచ
మంబు సంసక్తికయు షష్టంబు పదార్థభావనయు సప్తమంబు తుర్యయు నన్ను
ను నీసప్తభూమికలు ముక్తిమార్గంబులును సకలదుఃఖరాహిత్యంబులునై
య్యుండు వానివేరు వేర వివరించెద వినుము.

* శుభేచ్ఛ *

గీ॥ అకట నేనేల మూఢుండనై తినను చు । శాస్త్రదృష్టిని సజ్జన సంమతముగ
దగిలి వైరాగ్య కాంక్షచిత్తమున నూను । నది శుభేచ్ఛాఖ్యయండ్రు వేదాంతవిదులు

* విచారణ *

గీ॥ శాస్త్ర సత్సంగ వైరాగ్య సమతగలిగి । సద్విచార ప్రవర్తనల్ సలుపు చున్న
నది విచారణమనబడు ననఘచరిత । యిదియె రెండవ భూమియై యెసగుచుండు ॥

* తనుమానస *

కం॥ యీ రెంటిని మనుసునని డి * దారుణవిషయేంద్రియముల * దగులకున్నిన్
భారదను త్యము సేయుట * యారయ తనుమానసాఖ్య * యగు బోధనిధి ॥

* సత్వసంప్రాప్తి *

గీ॥ అనఘ నీమూడుభూములు నభ్యసించి । అర్థకాంక్షలు విడిచి సర్వాత్మనిష్ఠ
దగిలి శుద్ధాంతరంగుడై తలపులుడిగి । పరగుచుండుట సత్వసంప్రాప్తియండ్రు ॥

* సంసక్తిక *

కం॥ కూరిన యీ నాల్గును మది * వారక తలపోసి సంగ * వర్జితుడైన
త్త్వానూనస్థితినుండుట * యారయ సంసక్తినాము * మగు దాశరథీ ॥

* పదార్థభావన *

వ॥ యీ యైను భూములు నెరింగి స్వాత్మారాముండై బాహ్యాంతరంబుల బదార్థం
బులు లేమి దెలిసి పరమార్థంబు దెలుసుటయు పదార్థభావనయనంబరగుచుండు

* తు ర్య *

గీ॥ ఆరుభూములగతులను నాత్మ నెరిగి । యేమిటను నైన భేదంబులేమి దెలిసి
తత్వభావంబునష్టమైదనరు నెరుక । తుర్యగాగలయందృచా తుర్యహృదయా ॥

* తు ర్యా తీ తం *

వ॥ తుర్యగావస్థ గేజీవన్ముక్తియనంబడు మఱియుపదేహము క్తివిషయం బే తుర్య
గాతీతంబగునని చెప్పి వసిష్ఠుండు మఱియునిట్లనియె.

వ॥ భృగుయమనసంవాదే యమవాక్యం ॥ అదియట్లుంటేని చిత్తం బేపురుషుండు
తత్సమంబు బుద్ధియును తద్విలాసంబహంకారమునై యభిమతకృత్యంబులోన
రింపుచుండె నట్లుగావున చిత్తశాంతియే సర్వశాంతియు నని చెప్పిన కృతాంతు
వాక్యంబుల కుపశమనకోధుండై భృగుండిట్లనియె.

* వ శి ష్ఠో క్తి *

గీ॥ యెరుక పడకున్న నహమర్థ మెద్దియైన । మలినరూపంబుదోచియు బరమునొందు
యెరుక పడియున్న నహమర్థ మెద్దియైన । ననగ పరమాత్మకభమందా నై వెలుంగు ॥

* అ హం కా ర త్ర యం *

వ॥ అహంకారంబు జగత్త్రయంబునందు త్రివిధంబై యుండు నందుపూర్వంబొకటి
యును మధ్యంబులు రెండుంగలిగియుండు వినుము.

గీ॥ అమలవిమలంబు విశ్వమచ్యుతమునంబరము । నైనపరమాత్మరూపంబు నేనె కాని
అన్య మొక్కటి లేదనియాత్మ నెరుగు । నది యెప్పుత్తమహంకృతియనగబరగు ॥

గీ॥ అరయనన్నిటి వ్యతిరిక్తమై వెలుగు । తానవాలాగ్రశతకల్పితంబునగుచు
నెసగబరమాణురూపంబు నేనెయనెడి ! నాయహంకృతి మద్వితియంబుశుభము

కం॥ కరచరణాద్యవయవముల * నిరనై చెరియుంచు దేహ * మేననినుది లో
దిరముగనిల్చనహంకృతి * యరయతృతియాఖ్యమధమ * మగుదాశరధీ ॥

వ॥ యీయహంకారత్రయంబునీక్షినయతండు పరమనిర్వాణపదంబునొందు నహం
కారరహితులై తొల్లి భీమాదులు పరమపదప్రాప్తులగుట విస్పష్టంబుగా జెప్పెద
నాకర్ణింపుము.

సీ॥ పరమదుర్వాసనలఁగట్టుపడినమనసు । జ్ఞానవాసనచేఁ గాఁగి శాంతిఁబొందు
సమ్యగాలోకచిత్తవాసనలఁజిత్త । మడఁగుతిమిరంబునునుదీపమడఁచినట్లు ॥

వ॥ విశ్వాతీతంబైనచిదాత్మయందు విశ్వంబెట్లుండె నయ్యర్థంబు దేటపడ నెఱింగింపవే యనిన నమ్మునీశ్వరుండిట్లనియె.

కం॥ వినుతెలిపెద రాఘవచి * ద్ఘనమాత్మునియందు * దానగలిగె ప్రపంచం
బనుపేరవిజృంభించెను * ఘనమృగతృష్ణికలు * నీళ్లగతిదోచుగతిన్ ॥

సీ॥ పరగదనయాత్మపరవశభ్రాంతిజేసి । అన్యుఁడనుబోలెదోచినయట్టిభంగి
మానసంబునఁనజ్ఞానమహిమజేసి । నతఁడునతఁడునుగాకుండునఘచరితా ॥

సీ॥ వానరదీపంబునను వెలుగున్నయట్లు । సూర్యుఁడుండఁగఁ బవలవుచున్నయట్లు
పుష్పగలుగంగఁ దావియుఁబొలుచునట్లు । చిత్తుగలుగంగఁ జగములు జెలగు రామా ॥

సీ॥ అస్త్రమస్త్రంబుపై శాంతిమైనభంగి । విషముచాతనువిషమునువిరిగినట్లు
శతృచాతనుశత్రుండుసమయుమాడ్కి । మనసుచాతనుమనసునుమడియఁబడును ॥

సీ॥ ఘనుఁడువిద్యయట్లుజనియించెనోయను । గెలుపులెల్లమానితత్త్వమయతి
జెందిదీనినెట్లుజెరుతునోయనువిచా । రంబునిలుపుమాత్మరామచంద్రా ॥

వ॥ అదినశించునప్పుడు తజ్జననాదికారణంబును నెఱుంగనగునని నన్ని రఘునందనుండు జీవుండుమనోహర్షంబుదాల్చి యఖిలరించిపదంబునెట్లుపొందు నానతిమ్మనియడిగిన యతనికి పరమార్థవిదుండగు వశిష్ఠుండిట్లనియె.

* రా జ నీ తి ర త్నా క ర ము *

కం॥ అనయతనమునసేవనతుం * పౌరలంబడవలయుగాక * పౌరలనిచోనా
హార్యమైనదెల్పనోపున * చరమావధిదనకమూర్ఖ * జాతిసరునకున్ ॥

* కం దా ర్థ ము *

(౯౬) తలయెత్తిచూడజాలునె * అలచికటియెదుటనిల్చి * యజ్ఞాపుకళన్ * కలవచ్చి
మేల్కయందున * గలచేష్టలప్రోలనిల్చి * కనుగొనగలదా * అట్లనెఱుఁగక * కను
గొనగలదా * యిలలోసద్గురుబోధ * నెరిగినసరునిచే * ష్టలగంటెనుళ్ళక్క * సద్గు
రుబోధాట * కనుగొనగలదా * అట్లనెఱుఁగక * కనుగొనగలదా ॥

## ౫౦ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక

* కందార్థము *

(౯౭) అంటదు కలమేల్కనుమే * ల్కంటగా కలనెన్నటికిని * కదునిశ్చయమిా * రెంటి క్రియగుత్తుకబయలులు * రెంటిని రెండంటకుండు * రెండ్రెంటిలోనూ * కలమెరుకాలీ రెండూమిథ్యేనూ * దంటాగ మేల్కొబయలుంటా వెప్పటికేరిగి * రెంటూమాపై రెంట రెంటీకలమెరుకాల * రెండ్రెంటిలోనూ * కలమెరుకాలీ * రెండూమిథ్యేనూ *

* కందార్థము *

(౯౮) మెరుగదుసుషుప్తినిజాగ్రిత * నిరవొందసుషుప్తిరెంటి * నెరుగును మేల్కట్లరయగబయలెరుకలరె * ల్లెరుగదుబయలెరుకె రెంటి * నెరుగూచునుండూ * గురుముఖమూన * నెరిగీయీరెండూ * తిరమూగానెరుకాను * తీశి వేశి తెజాలు * పరులూనేనన్నియేటి * పగకేలేకుండని * ల్లెరుగూచునుండూ * గురుముఖమూన * నెరిగి యీరెండు ॥

* కందార్థము *

(౯౯) సంకల్పములేనిదెనిః * సంకల్పములోనదోచు * చనుదోచుచనుక * సంకల్పమెతప్పనని * సంకల్పము నెరిగెనేని * చనుతాలేననుచూ * నిఃసంకల్ప * మును నిల్చెదనుచూ * సంకల్పించుటకింకసంకల్పమేదిపః * సంకల్పమందిట్లుసంకల్పమోగితె * చనుతాలేననుచూ * నిఃసంకల్ప * మునునిల్చెదనుచూ ॥

* సర్వార్థసారసంగ్రహము *

కం॥ పోదవిడిచనసంకల్పం * బదిబోవకనాత్మరూప * మగుపడకుండుక
కదలెటిజలఘటమునతన * వదనమువీక్షింపగాన * బహువిధముగక ॥

కం॥ వివరింపగ సంకల్పం * బవిరళసంసారమగుచు * నాతటలెన్నక
వివిధములగుదుఃఖములను * భవమొందగ జేయునదియె * బాధంబగుచుక ॥

కం॥ సంకల్పమె చలనంబై * శంకలనదిదోప జేయు * జాడ్యమొనర్చుక
పొంకంబణంచుతెలివిని * పంకజభవునైనగాని * భ్రమనొందించుక ॥

కం॥ సంకల్పమెమానసమగు * సంకల్పమెచిత్తమగు * పరిశ్రస్తంబుగనా
సంకల్పమెహంకారము * సంకల్పమెబుద్ధియగుపి * చారముచాలక ॥

కం॥ సంకల్పమర్మభేదము * సంకల్పముచాత దెలియు * సంకల్పముచే
సంకల్పమెకొట్టుబడుఁ * సంకల్పమె సర్వమునకు * జన్మాలయముల్ ॥

కం॥ సంకల్పమె శంకించును * సంకల్పమె శంక దీర్చు * సంకల్పంబే
శంకను దీర్చుటనరయును * సంకల్పమె జ్ఞప్తిరూపు * సముదయమెల్లన్ ॥

కం॥ సంకల్పమె చేయించును * సంకల్పము చేయుచుండు * సాక్షియగును నా
సంకల్పమరయ రెంటికి * సంకల్పమె తెలియకుండు * సంశయమగుచున్ ॥

గీ॥ వొకటి జేయుచుండు నొకటి బల్కుచునుండు । నొకటదలపు చుండు నూరకుండు
నున్న చోటనుండ దూరూరు దిరుగుచుం । కల్పము హిమము నెన్నగా వశంబె ॥

కం॥ పంకజభవులక్ష్మీధవు * శంకర వజ్రిప్రభృతులు * సంసారములో
నంకిలిగొని విడకుండుట * సంకల్పము వలన గాదె * సత్పురుషవరా ॥

సీ॥ బహుళతరచ్ఛిద్రఘటజలో పలనమితమగుచు । మారుతము మూటగట్టిన మాడ్కి దోప
సర్వవిధమార్గములచాల సంచరించు । నిట్టి సంకల్పమణచు వాడీశ్వరుండు ॥

గీ॥ తరుచు మాటలేల తథ్యంబు జెప్పెద । సిద్ధవాక్యమొకటి చిత్తగింపు
సంశయంబు మనుజజన్మకారణము సుమీ । సంశయంబు భవవిసర్జనంబు ॥

చ॥ అనవిని బ్రాహ్మణోత్తముడు । హర్షమనోజ్జవికాసభాసియై
మునుకొని హస్తయుగ్మము మోడ్చి । నమస్కృతి మీర నాతడున్
మునివర దీని జన్మవిధముల్ । వివరంబు నాకతింపుమటం
చనుకరుణాసముద్రుడగు । నారగుడంతియ చింతచెన్నిట్లనన్ ॥

వ॥ ఆకర్ణింపుము మున్ను సత్యజ్ఞానానందాతీత నిత్య నిరామయ నిర్గుణ నిర్మల పరిపూర్ణ కేవల పరబ్రహ్మంబునందు కారణరూపంబై కారణరూపంబుగా తెలివిన్నిదోప జేసిన మాయయనే సంకల్పంబనంబడు నదిచిచ్ఛక్తియై తనవలన బుట్టిన తెలివికధికారంబొసంగి యీశ్వరుడనిపించి నంతట తానవిద్యయై యా యీశ్వరుణ్ణి జీవుడనిపించి సకలంబునకధిష్ఠానభూతునిగా నియమించి తానిచ్ఛాశక్తియై సర్వంబునిచ్ఛయింపంజేయుచు క్రియాశక్తియై సర్వకర్తృత్వంబులో నరింప జేయుచు జ్ఞానశక్తియై సంకల్పంబు నెరుంగంజేయుచు నీక్రమంబున సకల జగదుత్పత్తి స్థితి లయంబులు గావింపుచుండు కార్యకారణహేతుభూతంబును

౫౨ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

స్వాతంత్ర్యంబును పారతంత్ర్యంబును సకలనిర్ణయనియంతృత్వంబును ప్రవర్తకత్వంబును గలిగి యీశ్వరచైతన్యంబున కావరణభూతంబై సనాతనంబై సర్వవ్యాపకంబై విలసిల్లుననిన నాయజ్ఞవర్యుండిట్లనియె.

ఉ॥ దేవమునీంద్ర విన్నపము ♦ దీనివిధంబును దీనిజన్మముఙ్
భావమునందు గానబడె ♦ పాల్పడదోచు స్వరూపమెట్టిదో
సేవకుడన్ వినన్ దలచి ♦ చేసితి చర్చ వచింపగా దగున్
నావుడు ధీవిశారదుడు ♦ నారదుడీగతి జెప్పె నెప్పుగన్ ॥

సీ॥ ప్రాణిహృన్మణోత్తమ చలనస్వభావమైన ♦ యట్టిసంకల్పరూపంబు నడిగితేని
తనదు కర్మసమూహమే దానిరూప ♦ మనిన భూసురవర్యుడిట్లని యెనుగుడ ॥

శా॥ స్వామీ దీనివిధంబు జన్మమును ♦ దోచంబడ్డ రూపంబు నే
నీమూడుం వినవయ్యె నింక ♦ నిలయం బెట్లుండునో లెస్సగా
నామీదన్ దయదల్చి తెల్పదగు ♦ నన్నన్ సంయమీంద్రుండుదా
నామోదంబున నింక మాటనుడివెన్ ♦ చర్చించు సందోహమున్ ॥

గీ॥ నిలయమెట్టిదనుచు తెలియగా నేటికి ♦ మానసంబె దాని యునికిపట్టు
దనరమరియు నింక ననుమానమే యున్న ♦ నడుగుము విననంతె నాతడనియె ॥

మ॥ అనఘా స్వామి మహానుభావ ♦ విననర్హంబయ్యెడిన్ దీనిసం
జననం బాకృతి ఘున్ నివాసమును ♦ దోచంగంటినిట్లుండగా
ఘనమౌ వృద్ధిలయంబు లింక దెలియం ♦ గా యుణ్యాచిత్తంబునం
దనరంగా నితిహాసరూపకము ♦ చాతన్ జెప్పగా లెస్సగున్ ॥

* కం దా ర్థ ము *

౧౦౦ యెరుకతసకుదాపిడిపో * దెరుకనువిడిపించలేరు * యెవ్వరుధాత్రిన్ * గురుడౌకడుదప్ప గురునకు * పరిచర్యయొనర్చిబోధ * పద్ధాతిపినినన్ * తిరిగిరాని పద్ధాతిగనినన్ పరిపూర్ణమెరుకాయేర్పరుచా యెరుకలేక * హరినిస్వప్నముగన్న * కరిప్రమ్గినట్లాయీ * పద్ధాతివినినన్ * తిరిగిరాని * పద్ధాతిగనినన్ ॥

కం॥ కలనేనసింహ్వామునుకం * న్నులగనమ్మృతి జెందినట్లు * యుళ్ళక్యగునీ
వలగురుకృప చేబయలుం * దెలశూరికెయుంటివేని * తీరునుమాట ॥ రగి ॥

* శ్రీ శివరామదీక్షితీయ మనుబృహద్వాశిష్ఠం *

* అచల బోధశిద్ధాంతం *

గ॥ గురుమూలంగా విచారించిన వారికి । భ్రాంతి యెన్నటికిలేదు । విచారించనిమూర్ఖులు । బురదనీళ్ళవలెవుంచ్చారు । కుక్కలుచచ్చినట్టూ చస్తారు । యింతేకాని మనిష్యికి । కుక్కలకు । గాడిదెలకు । పందికి । విచారించకపోయితె । యెక్కువా తక్కువా లేదు । పుటుకా భ్రాంతిసమానమే । గనక । చదువుకుంటె । యేనుగకుప్రసిద్ధివున్నట్టు । ప్రసిద్ధిమాత్రమె । కొనకూ రెండువొక్కటే । యత్తుమాత్రమే యెక్కువ । విచారించినవాడూ । శింహ్వాంవంటివాడు । యేనుగలుపరువాలేదు నేనుస్వప్నంలోవస్తే । చచ్చేయేనుగలు । నన్ను చూస్తేయేమిబ్రతికీని । విచారించినవానితో సమానుడు । యెవ్వడులేడు । విచారించినవానిముందర మాట్లాడేదేతప్పు యీదేహంవుండగానే । దేహంలేకవున్న వారునీరులు ॥

* గద్య *

ఇతి * శ్రీమద్గురు శివరామదీక్షితపరిభావే వేదాంతవిచారసే.

* భ్రాంతి గహిత ప్రకరణం *

* హస్తామలక గ్రంధం *

శ్లో॥ సచ్చిదానందరూపాయ । నిజానందస్వరూపిణే
స్వప్రకాశాయశుద్ధాయ ఆచార్యాయనమోస్తుతే ॥

* శంకరాచార్యావాచ *

శ్లో॥ కస్త్వంశిశోకస్యకుతోసిగంతా । కిన్నామతేత్వంకుతఆగతోసి
ఏతన్మయోక్తంవదచార్భకత్వం । మత్ప్రీతయేప్రీతివివర్ధనోసి ॥

* హస్తామలకోవాచ *

శ్లో॥ నాహంమనుష్యోనచదేవయక్షో । నబ్రాంహ్మణక్షత్రియవైశ్యశూద్రాః
నబ్రంహ్మచారీనగృహీవనస్థో । భిక్షుర్నచాహంనిజబోధరూపం ॥

గిర శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

శ్లో॥ నిమిత్తంమనశ్చక్షురాదిప్రవృత్తౌ । నిరస్తాఖిలోపాధిరాకాశకల్పః
రవిర్లోకచేష్టానిమిత్తంయథాయః । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ యమగ్న్యుష్ణవన్నిత్యబోధస్వరూపం । మనశ్చక్షురాదీన్యబోధాత్మకాని
ప్రవర్తంతమాశ్రిత్యనిష్కంపమేకం । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ ముఖాభాసకోదర్పణేదృశ్యమానో । ముఖత్వాత్పృథక్త్వేననైవాస్తివస్తు
చిదాభాసకోధీషుజీవోపితద్వ । త్సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ యథాదర్పణాభావఆభాసహానౌ । ముఖంవిద్యతేకల్పనాహీనమేకం
తథావిద్ధియోగేనిరాభాసకోయః । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ మనశ్చక్షురాదేర్వియుక్తస్స్వయంయో । మనశ్చక్షురాదేర్మనశ్చక్షురాది
మనశ్చక్షురాదేరగమ్యస్వరూపం । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ యఏకోవిభాతిస్వతశ్శుద్ధచేతా । ప్రకాశస్వరూపోపినానేవధీషు
శరావోదకస్థోయథాభానురేకం । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ యథానేకచక్షుప్రకాశోరవిర్నే । క్రమేణప్రకాశీకరోతిప్రకాశ్యం
అనేకాధియోయస్తథైకప్రబోధ । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ వివస్వత్ప్రభాతంయథారూపమక్షం । ప్రగృహ్ణాతినాభాసమేకంవివస్వాన్
తథాభాసఆభాసప్రత్యక్షమేకం । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ ఘనచ్ఛన్నదృష్టిర్ఘనచ్ఛన్నకర్మ । యథానిష్ప్రభంమన్యతేచాతిమూఢః
తథాబద్ధవద్భాతియోమూఢదృష్టే । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ సమస్తేషువస్తుష్వనుస్యూతమేకం । సమస్తానివస్తూనియన్నస్పృశంతి
వియద్వత్సదాశుద్ధమచ్ఛస్వరూపం । సనిత్యోపలబ్ధిస్వరూపోహమాత్మా ॥

శ్లో॥ ఉపాదౌయథాభేదతాసన్మణీనాం । తథాభేదతాబుద్ధిభేదేషుతేపి
యథాచంద్రికాణాంజలేచంచలత్వం । తథాచంచలత్వంతవాపీహవిష్ణో ॥

* కందార్థము *

(౧౦౧) అపరోక్షమానెమనుజుల * కుపరోక్షంబైనబయలు * గురుకృప లేక * అప రోక్షమౌను మనుజుల * కుపరోక్షంబైనబయలు * గురుకృప గలుగా * కేలివెలేని

యొరు కాతాతోలుగా * విపరీతమౌబుద్ధి * విడచీనీ చెప్పాడు * ఉపచారములు జేయు
చుండుముగురునికి । గురుకృపగలుగా * కీలిదెలేని * యొరుకాతాతోలుగా ॥

* భా వా ర్థ దీ పి క *

సర్వదామాంఅహంన వేద । ప్రత్యక్షైతస్యమాయారహితత్వాత్ । తస్మాత్క-
చిన్మాయయా వేద । మాయయాన వేద । అదర్శనస్వభావాత్ । అవ్యక్తమితి
ప్రసిద్ధమేవా । అవ్యక్తంనామ అదర్శనం । అదర్శనాదాపత్తితాత్పునశ్చదర్శ
నంగతాఇతిస్మృతేః । విద్యుదభ్రినిమేషవత్ । వర్షణవత్ । పాషాణాగ్నివత్
మథనాగ్నివత్ । వసంతకాలే గహనే అగ్నిజాతవత్ । ఖద్యోతవత్ । తస్మా
త్ అగ్నిఃసర్వదాఅంతరేనాస్తి । బాహ్యేనాస్తి । ద్వైతాపేక్షయా కాష్ఠాది
సహాయేన అస్త్యేవసామార్థ్యేనచ తద్వత్ । స్వయంప్రకాశమానత్వాత్
ఉష్ణస్వభావాత్ । దాహకసామార్థ్యత్వాత్ । యావత్పర్యంతమస్తితావ
త్పర్యంతమేవపరిగల్భః । తద్వచ్చిదగ్నిః । తస్యమూలంనాస్తి । ఆగంతుకత్వా
త్ సామర్థ్యేనప్రసిద్ధః । యావదస్తి తావత్పర్యంతమేవ అస్తీతిభ్రమః
విచారరహితత్వాత్ । విచారేణఅస్తీతిసర్వశూన్యమేవ । గర్జితవత్ । శం
ఖనాదవత్ । భేర్యాదివాద్యవిశేషవత్ । అట్టహాసవత్ । దుఃఖవత్ । ఉద
రరోగవత్ । తద్వత్కదాచిత్కమేవచిదగ్నిః । అసద్రూపత్వాత్ । శశవిషా
ణవత్ । వంధ్యాపుత్రవత్ । ఖపుష్పవత్ । నరశృంగవత్ । తస్మాత్
మిథ్యాజ్ఞానేనమిథ్యాభ్రాంతిః । మిథ్యాజ్ఞానస్యలక్షణంకిం । క్షేత్రాదికంనామ
కిం । శరీరాదికంజానాతి । వేత్తి । విజానాతి । విజ్ఞానమితిప్రసిద్ధమేవ । విద్యేతి
ప్రకృతిరితి । పురుషఇతి । ఆత్మేతి । క్షేత్రజ్ఞఇతి । సచ్చిదానందమితి । పర
మాత్మేతి । పరమేశ్వరఇతి । కూటస్థఇతి । బ్రహ్మేతి । ద్రష్టేతి । శ్రో
తేతి । విజ్ఞాతేతి । ఏతానిమిథ్యాజ్ఞానస్యస్వరూపాణి । జ్ఞానమేవజీవోపాధిః
తస్యైవఅద్వైతసంజ్ఞా । అభేదసంజ్ఞా । నిర్గుణసంజ్ఞా । మాయాఅవిద్యేత్యాది
సంజ్ఞా । తస్మాత్ । వేదనేన । వేదనంమిథ్యేతిదృఢాభ్యాసః । తదాచిజ్జడ
భ్రాంతిరహితః । జన్మాదిభ్రాంతిరహితశ్చ । సర్వశూన్యేనసర్వశూన్యమితి

గీ॥ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

దృఢనిశ్చయఏవ । విచారస్యఫలం । సపవబంధమోక్షరహితః । జ్ఞానాజ్ఞాన రహితత్వాత్ । తంకోవేద । అంధపురుషద్వయవత్ । అలంవిస్తారభయాత్ ॥

* ఇతి * భావార్థదీపికా సమాప్తః *

* కందార్థము *

(౧౦౨) నేనెవ్వడననుజీవుడు * నేనే నేననను శివుడు * యీ రెండనక * తానుండు నచలమివిటని * నేనెరిగరిగిననుపైది * నేనెట్లనినీ * నేననకున్నా * తానెట్లనినీ / నేనన్నదాంట్లోదె * నీనాప్రసంగాము * తానన్నదాంట్లోనె * తలపోయువలెన్నట్లు / నేనెట్లనినీ * నేననకున్నా * తానెట్లనినీ ॥

* భద్రాద్రిరామ శతకము *

* ప్రజ్ఞానంబ్రహ్మ అనే శృతిలక్షణం *

సీ॥ శ్రవణేంద్రియంబులశబ్దముల్ వినుచుండు ౹ చర్మేంద్రియంబున స్పర్శనెరుగు
చక్షురింద్రియములవీక్షించురూపముల్ ౹ రూఢిగా జిహ్వచే రుచుల నెరుగు
ఘ్రాణరంధ్రంబులగంధమాఘ్రాణించు ౹ వాక్కు వచియించు వాక్యములను
యేజ్ఞానమునన్నితెలిగెనాజ్ఞానంబు ౹ ప్రజ్ఞానమనిశృతుల్ బలుకుచుండు
గీ॥ నట్టిప్రజ్ఞానలక్ష్యార్థమనుభవంబు ౹ నీస్వరూపంబునిక్కంబునిజపదంబు
రమ్యగుణధామభద్రాద్రిరామ ౹ పరసురాసురసి హ్మాదాససంరక్షితాహ్వా!

* భావార్థము *

౭౭ శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణేంద్రియములచే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధవిషయములను, వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదేంద్రియములచే, వచన, దాన, గమన, ఆనంద, విసర్జన, విషయములను, మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారేంద్రియములచే చలన, నిశ్చయ, చింతన, అభిమాన, విషయములను, యేజ్ఞానముచే యెరుగుచున్నదో, అదియే ప్రజ్ఞాన మనబడును.

సీ॥ భారతీపతిరమాపతిపార్వతీపతి ౹ వాసవాద్యఖిలదేవతులయందు
మానవాశ్వగవాదిమశకపిపీలికాం ౹ తముజీవులందుచైతన్యమొకటి
యట్టిచైతన్యమేయాత్మబ్రహ్మంబనే ౹ పదములకులక్ష్యార్థభావమిదియు
కమలజాదిపిపీలికాంతశరీరముల్ ౹ వాచ్యార్థమనివాటివదలితేను ॥

శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక. ౫౭

గీ॥ యాపరబ్రహ్మచైతన్యమాత్మల నటికి వాత్ర్థభేదంబులేకానివస్తువొకటి
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు రామనరసింహ్మదాససంరక్షితాంహ్వా॥

* భావార్థము *

౭౦ బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, యింద్రాదిదేవతలయందును మనుష్య, అశ్వ, పసువులు, మొదలైన దోమలు, చీమలు, వరకుయుండెడి జీవులయందును గుర్తెరిగే చైతన్యమే బ్రహ్మమనబడును గనుక బ్రహ్మమొదలు పిపీలికమువరకు యుండెడిశరీరములు వాచ్యార్థమని విడిచితే ప్రజ్ఞానము బ్రహ్మముఅనెడి కలుకుభేదములేకాని వస్తువొకటి అని యెరుగవలెను.

* అహం బ్రహ్మాస్మి యనేశ్రుతిలక్షణం *

సీ॥ పరిపూర్ణమైయున్న పరమాత్మబ్రహ్మవి ద్యకుయోగ్యమైనకాయంబునందు
బుద్ధికిసాక్షియైస్ఫురియింపుచున్నది యహమనేపదమునకర్థమగును
ప్రతిలేనిదై స్వతఃపరిపూర్ణపరమాత్మ బ్రహ్మశబ్దమునకర్థంబునిదియు
అహమేబ్రహ్మబ్రహ్మావాహమని యున్న యస్మ్యనేపదమునకర్థమనుచు ॥
గీ॥ నెరిగివాచ్యార్థము లనెల్ల పరిహరించి యనుభవజ్ఞానిబొందులక్ష్యార్థమందు
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు రామనరసింహ్మదాససంరక్షితాంహ్వా॥

* భావార్థము *

౭౧ బ్రహ్మవిద్యకు అధికారియైన దేహమందు బుద్ధికిసాక్షియై స్ఫురింపుచున్నది యేదో అది అహంఅనేపదమునకు అర్థమగును. ప్రతిలేనిదై స్వతఃసిద్ధమై పరమాత్మయైనవస్తువ బ్రహ్మఅనేపదమునకు అర్థమగును అహమేబ్రహ్మము బ్రహ్మమే అహమని తెలిసికొనుటయే అస్మిఅనేపదమునకు అర్థమగును పిండబ్రహ్మండములైన ఉపాధులువాచ్యార్థమని యెరుగవలెను.

* తత్వమసియనేశ్రుతిలక్షణం *

సీ॥ మరియుసృష్టికిపూర్వమందద్వితీయమై నామరూపక్రియలేమిలేక
యేకమైయచలమైయేదియుండునొనది తత్పదలక్ష్యతాత్పర్యమిదియు

౫౮ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వకందార్థానేక సద్దృష్టాంత ప్రకాశిక

తనవివేకమునసాధనచతుష్టయములు । గలిగినపూర్ణాధికారియందు
ధీమనోచిత్తాదిదేహేంద్రియములక । తీతమైసాక్షియై తేజరిల్లు
గీ॥ నదియుత్వంపదలక్ష్యార్థమనగనొప్పు । నసిపదార్థంబులీరెంటికైక్యమరయ
రమ్యగుణధామభద్రాదిరామపరశు । రామునరసింహ్మదాసనంరక్షితాంహ్వ॥

## * భా వా ర్థ ము *

వ॥ సృష్టికిపూర్వమందద్వితీయమై నామరూపక్రియాశూన్యమై యేకమై అచలమై యేదియున్నదో అది తత్పదలక్ష్యార్థమౌను మోక్షాధికారియందు మనోబుద్ధిచిత్తాదిదేహేంద్రియములకతీతమై సాక్షియై తేజరిల్లుచుండేది యేదో అది త్వంపదలక్ష్యార్థమౌను. పిండబ్రహ్మాండములైన వాచ్యార్థములవిడిచి ఒకదేహముయొక్కసాక్షిన్ని బ్రహ్మాండాతీతమైన బ్రహ్మనున్ను అతడే సాక్షి సాక్షే అతడని ఐక్యపరచుటే అసిపదమునకు లక్ష్యార్థమౌను.

## * అ య మా త్మా బ్ర హ్మ అ నే శ్రు తి ల క్ష ణ ం *

సీ॥ స్వచ్ఛమైసత్యమైస్వప్రకాశంబునై । యపరోక్షమైసదాయమలమగుచు
నాద్యంతరహితమైయచలమైనిత్యమై । శుద్ధమైబుద్ధమైసిద్ధమగుచు
నివ్యాజమైనట్టినిర్గుణంబయమాత్మ । పదముకులక్ష్యతాత్పర్యమిదియు
ప్రతిలేనిదైనిరుపద్రవంబైస్వతః । పరిపూర్ణమైబట్టబయలునగుచు
గీ॥ జగదధిష్ఠానమైచరాచరములందు । బాధితములేకయున్నదేబ్రహ్మమగును
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామునరసింహ్మదాసనంరక్షితాంహ్వ॥

## * భా వా ర్థ ము *

వ॥ దేహేంద్రియాతీతమై స్వచ్ఛమై స్వప్రకాశమై అపరోక్షమై ఆద్యంతశూన్యమై నిత్యమై శుద్ధమై బుద్ధమై సిద్ధమైయున్న నిర్గుణబ్రహ్మమే అయమాత్మయనేపదమునకు లక్ష్యార్థమౌను. బ్రహ్మాదిపిపీలికాంతి తనువుల చరాచరముల కధిష్ఠానమై ప్రతిలేనిదై నిరుపద్రవమై పరిపూర్ణమై బట్టబయలైయున్నదే. బ్రహ్మపదమున కర్థమౌను యీరెండు వాక్యములని తెలిసేది.

సీ॥ అలచతుర్వేద మహావాక్యములయందు । నీవె బ్రహ్మవు బ్రహ్మ నీవె యనుచు
యుపనిషద్భాష్యంబులూహించి వెతికిన । నీవె బ్రహ్మవు బ్రహ్మ నీవె యనుచు
యోగశాస్త్రములలో యుక్తి సాధించిన । నీవె బ్రహ్మవు బ్రహ్మ నీవె యనుచు
మంత్రిశాస్త్రములలో మర్మముల్ దెలసిన । నీవె బ్రహ్మవు బ్రహ్మ నీవె యనుచు
గీ॥ వేద వేదాంత సిద్ధాంత వేద్యులెల్ల । నిశ్చయింతురు సత్యంబు నిగమవినుత
రమ్యగుణధామ భద్రాద్రి రామవంశ । రామనరసింహ్మదాస సంరక్షితాంహ్వ॥

* భా వా ర్థ ము *

౮౨ నాలుగు మహావాక్యములందును ఉపనిషద్భాష్యములందును యోగశాస్త్రములందును మంత్రశాస్త్రములందును నీవే బ్రహ్మవు బ్రహ్మయే నీవని చెప్పబడెను

సీ॥ వర బ్రహ్మ క్షత్రియ వైశ్యాది వర్ణముల్ । నీకు యెన్నడు లేవు నిశ్చయముగ
నల బ్రహ్మచర్యాది యాశ్రమ ధర్మముల్ । నీకు యెన్నడు లేవు నిశ్చయముగ
స్వగత విజాతి స్వజాతి భేదంబులు । నీకు యెన్నడు లేవు నిశ్చయముగ
కుల రూప నామముల్ గోత్రసూత్రంబులు । నీకు యెన్నడు లేవు నిశ్చయముగ
గీ॥ ఖేద మోదంబులును వాద భేదములును । నీకు యెన్నడు లేవయా నిశ్చయముగ
రమ్యగుణధామ భద్రాద్రి రామవంశ । రామనరసింహ్మదాస సంరక్షితాంహ్వ

* భా వా ర్థ ము *

౮౩ బ్రహ్మ క్షత్రియ వైశ్యాది వర్ణములును బ్రహ్మచర్యాది ఆశ్రమధర్మములును స్వజాతి విజాతి స్వగత భేదములును నామ రూప కుల గోత్రములును ఖేద మోదములును వాద భేదములును నీకు లేవని తెలిసికొనుము.

* స దా నం ద యో గి శ త క ము *

గీ॥ తన్ను దెలసిన నన్యంబు తనకు లేదు । తన్ను దెలసిన బ్రహ్మంబు తానె యగును
తన్ను దెలసిన సద్గురోత్తములవలన । నవ్యతరభోగి శ్రీ సదానంద యోగి॥
గీ॥ సద్గురువు గల్గు మీదట చదువులేల । నిజమెఱింగిన పిమ్మట నిష్ఠ లేల
సర్వము నుదానె యయ్యున్న సరణి గాదె । నవ్యతరభోగి శ్రీ సదానంద యోగి॥
గీ॥ త్వంపదంబును నది యెపో తత్పదంబు । తత్పదంబును నది యెపో త్వంపదంబు

అసిపదంబును నీరెంటి కైక్యపదము। సద్వ్యతరభోగి శ్రీసదానంద యోగి ॥

గీ॥ సకలసమ్మత శిష్యుడిగాను శక్తిగాదు। జీవుడునుగాదు పరమమై జెందుబ్రహ్మ

సద్భుతానందకరమైనయనుభవంబు। సద్వ్యతరభోగి శ్రీసదానంద యోగి ॥

* రా మ స్త వ రా జ ము *

గీ॥ వాక్యయుక్తిలోననుస్న దితత్వంబు। నట్టిచదువులపోరు వెట్టిగాదె

నేను నేనటంచు నెనశిన తెలిపిదా। తానుగాక వేరెతానుగలడె॥

* అ ను భ వా మృ త ప్ర క ర ణ ము *

సుఖమహమవాప్నమితి। వేదనరహితేనవదతి। తత్సమయేఅహంవృత్తిశూన్య త్వాత్ ।సుఖంకోవేద। దుఃఖంకోవేద। జ్ఞానస్యమూలంకిం। అజ్ఞానస్యమూలంకిం। కోవేద। అహంవృత్త్యాఖ్యజీవోపాధివిలయేసతి। తస్మిన్కాలే వేదనమస్తీతివానవా। యదాఅహంజాయతేతదావదతి। అహమితి। తత్వమితి। జ్ఞానమితి। విజ్ఞానమితి। భేదమితి। అభేదమితి। బ్రాహ్మణోహం। చండాలోహం నిర్గుణః। సగుణః। ఇతివ్యవహారో విస్వృత్తిస్వభావః। నమఃసమయేగజ్జతాదిపటాటోపవత్ । సకాలేసత్యవద్భాతి। అగ్నివత్ । సూర్యవత్ । చంద్రవత్ । తద్వత్కదాచిత్కమేవజ్ఞాపకః। అంధకారవత్ । జ్ఞాపకరహితః। విచారవతాంఉభయరహితః। అహంవృత్త్యాఖ్యజ్ఞాపకరహితత్వాత్ । కదాచిదస్వప్నసర్వశూన్యనిశ్చయః। అయమేవజీవాఖ్యోపాధిరహితః। తస్మాత్ । నవిచారవతః। యేమీలేదు। నేను యేమీలేదు । సర్వదాఇదమేవవిచారః। ఇదమేవ నిజగురూపదేశః। వ్యవహారకాలే భోజనకాలేచ దృఢాభ్యాసః। అయమేవ చిజ్జడరహితః। క్షేత్రక్షేత్రజ్ఞరహితః। సగుణనిర్గుణరహితః। ప్రకృతిపురుషరహితః। జగజ్జీవరహితః। సదసద్రహితః। జ్ఞానాజ్ఞానరహితః। విద్యావిద్యరహితః। భేదాభేదరహితః। పుణ్యపాపరహితః। ధర్మాధర్మరహితః। ప్రవృత్తినివృత్తిరహితః। జీవేశ్వరరహితః। కూటస్థబ్రహ్మరహితః। బాహ్యసర్వశూన్యమితిస్మృతేః। అంతరేఅహంసర్వశూన్యమితిస్మృతేః। అయమేవసర్వేషాంభావార్థః। ఏవమఃపరిసమాప్తిః। నశ్రోత్రస్నాతానామావశ్యకం సర్వే

షాం భుక్తసదాపేక్షారహితత్వాత్ । జ్ఞానస్యమూలం సర్వశూన్యమితి । వాగ్వ్యాపారమాత్రమేవ । విచారరహితానాం ప్రయోజనం । తత్త్వరాదీనాం స్వభావవత్ । మూర్ఖాణాంమూలంనాస్తి ॥

* ఇతి * అనుభవామృత ప్రకరణం సమాప్తః *

* కందార్థము *

(౧౦౩) * తోట్టెలుతొమ్మిదిగల * మేస్త్రీకియొక రెంటిలోన * మట్టెలు నాల్గుం * డెట్టిది తెల్లదినల్లది * కట్టెది దానగ్రమందు * గలదొక్క తూటూ * అది యెరుకానే పులిగుండే చోటూ * కుట్టా గురుబోధానే * గొడ్డాలిచేబూని * వట్టిపులుగుల రెంట్నీ మలచికొట్టరపోని * కలదొక్క తూటూ * అదియెరుకానే * పులిగుండే చోటూ ॥

—(*) శ్రీ శివరామదీక్షితీయమను బృహద్వాసిష్ఠం (*)—

(*) అచలబోధ శిద్ధాంతం. (*)

గ॥— అహంకారము అన్ని కులములందు కలదు । అహంకారము లేని కులము లేదు అహంకారము లేని కులము మనోవృత్తినుము । అహంకారము లేని వారలకు యే బాధ లేదు । యే బాధలకైనా । యీ అహంకారమే మూలము । యీ అహంకారము । యీ చెట్టుకు విత్తనము । యీ చెట్టు । గాలికల్లనే కదలుచున్నది యీ చెట్టుమీదను । పంచవన్నెల చిలుకలు రెండుగలవు । రెండు సారంగములు గలవు । రెండుకోనేళ్లుగలవు । ఒక చలవబండకలదు । ఒకకోటి నక్కలు గలవు యిటువంటి వృక్షము । యెంతసేపోగాని నమ్మకము లేదు । అందుకేగదా "యేటియొడ్డు మ్రానువలెదాక నిలుచును" అని వేమనశతకమునందు చెప్పబడుచున్నది । యీ దేహము నిత్యమని యెవ్వరనుకోరు । యిందుకు యెవ్వరు తెలుసుకోగలరు । యీ భావమెవ్వనికిలేదు । యీ అహంకారము వదలుటచెల్లదభము

* గద్య *

ఇతి * శ్రీమద్గురు శివరామదీక్షితప్రభావే వేదాంతవిచారణే

అహంకారకుల నిరసన ప్రకరణం.

# యోగగురు సూత్రం.

వ॥ సర్వదృగ్దృశ్య స్వరూప జగత్ప్రకాశమానం విజ్ఞానం। సర్వ వేదాంతోక్త సిద్ధాంత అమనస్కమార్గ రాజయోగః। పూర్వాదివే రక్త శ్వేత కృష్ణ నీల వర్ణాస్తే జీవవర్ణాః॥

* జీవతనవః *

తేషామధిదేవతాః। విశ్వ తైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మానః। తేషాంస్థానాని। స్థూల సూక్ష్మ కారణ మహాకారణాని తేషాముత్తగత పీత కర్బుర। శ్యామల స్ఫటికవర్ణాస్తే। ఈశ్వరవర్ణాః॥

* ఈశ్వరతనవః *

సృష్టి స్థితి లయ సర్వసాక్షిః తేషామధిదేవతాః। బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వరః ఏవం మాత్రస్య మహావాక్యలక్షణం॥

* తత్వమసి వాక్యార్థం *

జీవతను చతుష్టయం త్వంపదం। ఈశ్వరతను చతుష్టయం తత్పదం। తన్మధ్యస్థ శిఖాస్వరూప మమనస్కం। అసిపదం॥

* షట్చక్రలక్షణం *

ఆధారాపృథ్వీ। స్వాధిష్ఠానముదకం మణిపూరకమగ్నిః। వాయోరనాహతాః తస్మిన్నీలవర్ణే విశుద్ధచక్రం। బిందుకళాద్వయ మాజ్ఞేయచక్రం॥

* పంచభూతవర్ణాః *

పృథివ్యాః రక్తవర్ణం। ఉదకం శ్వేతవర్ణం। అగ్నిః కృష్ణవర్ణం। వాయు ధూమ్రవర్ణం। ఆకాశస్య పీతవర్ణం॥

* పంచభూతప్రమాణం *

భూమి సార్ధాంగుష్టం। ఉదక మంగుష్టప్రమాణం। అంగుష్టార్ధ మగ్నిః। వాయో రంగుష్ట చతుర్థం। అణుమాత్రమాకాశం॥

* పంచశక్తులు *

పృథివ్యాః క్రియాశక్తిః । ఉదకస్య జ్ఞానశక్తిః । అగ్నే ఇచ్ఛాశక్తిః । వాయో రాదిశక్తిః । ఆకాశస్య పరాశక్తిః ॥

* వాక్కులు *

వైఖరీ । మధ్యమా । పశ్యంతి । పరా । స్వరః ॥

* బీజాక్షరాణి *

లకార । వకార । రకార । యకార । హకారాదయః ।

* ఈశ్వరాక్షరాః *

అకార । ఉకార । మకార । ఇకార । ఎకారాః ॥

* అంతఃకరణపంచకం *

పృథివ్యాః అహంకారః । జీవే చిత్తం । అగ్నే బుద్ధి । మనో వాయుః । విజ్ఞాన మాకాశః ॥

* పీఠాలు *

త్రికూట । శ్రీహాట । కొల్హాట । లయాట । బ్రహ్మరంధ్ర ।

* స్థానాలు *

నేత్ర । కంఠ । హృదయ । నాభి । మూర్ధ్నే ।

* అధిపతులు *

బ్రహ్మ । విష్ణు । రుద్ర । ఈశ్వర । సదాశివ ॥

* అవస్థలు *

జాగ్ర । స్వప్న । సుషుప్తి । తురీయ । తుర్యాతీతః ॥

* పంచబ్రహ్మలు *

సద్యోజాత । వామదేవ । అఘోర । తత్పురుష । ఈశానః ।

* బ్రహ్మాణః *

తారకం । దండకం । కుండలి । చంద్రాకార । ప్రణవ ।

* భక్తులు *

పృథివ్యాః చరలింగభక్తిః । స్థలం సద్భక్తిః । ప్రచితసేవ లవణాత్మప్తిః । జలస్య

౬౮ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

గురులింగమహేశ్వరస్థలం । నైష్ఠికభక్తిః । వృచిః సేవ । మధురతృప్తిః । అగ్నేః
శివలింగప్రసాదస్థలం । అవధానభక్తి । సంబుద్ధిసేవ । కటుకద్రవ్యతృప్తిః
వాయోః । ప్రసాదలింగస్థలం । సమరసభక్తి । సుజ్ఞానసేవ । తిక్తద్రవ్యతృప్తిః
ఆకాశస్య । అజ్ఞాచక్రస్య మహాలింగ చరణైక్యస్థలం । ఆనందభక్తి । సద్భావ
సేవ । కషాయద్రవ్యతృప్తిః । యోగసద్గురూణాం సజ్జనోయాతి నాన్యకర్మణా
ఇతి శ్రీయోగగురుసూత్రం యోజానాతి సజీవన్ముక్తః ॥

* భద్రాద్రి రామ శతకము *

* ఆత్మ జ్యోతి స్థానం *

సీ॥ కొండమీదను పెద్దగుండు నొక్కటియుండు ఽ గుండునడుమను నల్లగండ్లు రెండు
గండ్లమధ్యను నక్కకూతలు బెడుచుండు ఽ కూతలనడుమను నూతియుండు
నూతిమధ్యంబున నాతి యొక్కతెయుండు ఽ నాతిమీదను నొక్కకోతియుండు
కోతిమీదను పరంజ్యోతి వెల్గుచునుండు ఽ జ్యోతియే జగమెల్ల జూచుచుండు
గీ॥ చూచుచుండెడి దానందు చోద్యమెరిగి ఽ నదియు తానని యున్నవాడాత్మవిదుడు
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశు ఽ రామనరసింహ్మదాస సంరక్షితాంహ్వా

* భావార్థము *

౬౧ కొండమీదను ఒక పెద్దగుండు గుండునడుమను రెండు నల్లగండ్లు ఆగండ్లను మధ్యను నక్కకూతలు కూతలనడుమను నూయి నూతిమధ్యమున నాతి నాతిమీదను కోతి కోతిమీదను జ్యోతి వెలుగుచుండును ఆజ్యోతియే బ్రహ్మాండమంతయు జూచుచుండును అట్టిదానిని గుర్తెరిగి అదియే తానని యున్నవాడే ఆత్మవిదుడు.

* పరమాత్మ స్థాన నిర్ణయం *

సీ॥ విమల చిన్మయ నేత్రకమలమధ్యంబున ఽ మార్తాండసోమాగ్ని మండలములు
మండలంబులయందు మహనీయముగ నొక్క ఽ నీలమేఘంబు నిజముగాను
మేఘమధ్యంబున మెరుపు మెరయుచునుండు ఽ నందు నీవారశూకాగ్రముండు
శూకాగ్రమున నతిసూక్ష్మస్వరూపమై ఽ బహిరంతరంబుల ప్రజ్వరిల్లి
గీ॥ వెలుగుచున్నావు నేకమై వేరులేక ఽ నిర్మలాకార నిరుపమ నిర్మలాత్మ
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశు ఽ రామనరసింహ్మదాస సంరక్షితాంహ్వా ॥

శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక. ౬౧

* భావార్థము *

౬౨ చిన్మయనేత్రకమలమధ్యమున సూర్యచంద్రాగ్నిమండలములను మండలముల యందు నీలమేఘమును మేఘమధ్యమున మెరుపును మెరుపుమధ్యమున నీవారశూకాగ్రమును శూకాగ్రమున పరమాత్మ అణుస్వరూపమై లోపల వెలుపల యేకముగా ప్రకాశించుచుండును.

* ప్రకృతి క్షర లక్షణం *

సీ॥ జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు । ప్రాణాదులైదు శబ్దాదులైదు
ఘనమనోబుద్ధ్యహంకార చిత్తంబులు । నాల్గుగూడిరువదినాల్గుతత్త్వ
ములుగూడి ధవళశ్యామలరక్తపీతవ । ర్ణములునాలుగుగలిగినదియు ప్రకృతి
నదిక్షరంబది క్షేత్రమది జడంబది దృశ్య । మదియవిద్యాజ్ఞాన మదియనాత్మ
గీ॥ నదియె జీవంబునది దేహమది జగంబు । నదియు సంసారమది బంధ నరకమదియు
రమ్యగుణధామ భద్రాద్రిరామపరశు । రామనరసింహ్మదాస సంరక్షితాంహ్వ ॥

* భావార్థము *

౬౩ జ్ఞానేంద్రియములు ౫ కర్మేంద్రియములు ౫ ప్రాణేంద్రియములు ౫ విషయేంద్రియములు ౫ అంతఃకరణములు ౪ యీ ౨౪ తత్త్వములతో గూడి ధవళ శ్యామల రక్త పీత వర్ణములు నాలుగు గలిగినది ప్రకృతియనబడును అదియే క్షరము క్షేత్రము జడము దృశ్యము అవిద్య అనాత్మ జీవము దేహము జగము సంసారము బంధము నరకము అనబడును

* అక్షర స్వరూప లక్షణం *

సీ॥ శ్వేతరక్తాసిత పీతవర్ణంబుల । నడుమ సునీల వర్ణంబుయుండు
నదినిలతోయద మగుదానినడుమ । నిర్వాతదీపము కాంతిరీతినుండు
నదియువిద్యుల్లేఖ నదియునాపోజ్యోతి । నదియునోంకారంబు నక్షరంబు
నది మేరుశిఖరంబు నదియుకైలాసంబు । నదిసత్యలోకంబు నాశ్రయంబు
గీ॥ నదియెవైకుంఠపదము తత్పదమునదియు । నదియుత్వంపద మంతరార్థంబునదియు
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు । రామనరసింహ్మదాస సంరక్షితాంహ్వ ॥

౬౬ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వకందార్థానేక సదృష్టాంత ప్రకాశిక

* భావార్థము *

౬౭ రక్త శ్వేత కృష్ణ పీత సునీలములనడుమ నిర్వాతదీపమువలె శుద్ధస్ఫటికముం
డును అదియేవిద్యుల్లేఖ ఆపోజ్యోతి ఓంకారము అక్షరము మేరుశిఖరము కైలాసము
సత్యలోకము వైకుంఠము తత్పదము త్వంపదము అసిపదము అనబడును

సీ॥ శ్వేతరక్తాసితపీతనీలంబుల – నడుమనివాసమైనావునీవు
మానితాదిత్యసోమాగ్నిమండలముల – నడుమనివాసమైనావునీవు
పొంనుగాకళనాదుబిందుత్రియంబుల – నడుమనివాసమైనావునీవు
విమలభగీరథీయమునాసరస్వతి – నడుమనివాసమైనావునీవు
గీ॥ అండపిండబ్రహ్మాండభాండములను – నడుముయున్నావునీవుయానందముగను
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు – రామనరసింహదాససంరక్షితాంహ్వ॥

* భావార్థము *

౬౮ రక్త శ్వేత కృష్ణ పీత సునీలములమధ్యను సూర్యసోమాగ్నిమండలములమ
ధ్యను నాదబిందుకళలమధ్యను గంగాయమునాసరస్వతులమధ్యను అండపిండబ్రహ్మాం
డభాండములమధ్యను అక్షరస్వరూపమైన ఆత్మయున్నాడని యెరుగవలెను

* అష్టదిక్పాలకుల స్థలనిర్ణయం *

సీ॥ భ్రూమధ్యమునజంభభేదిపురంబుండు – నగ్నిహోత్రునిపురంబక్షియందు
దక్షిణకర్ణమందంతకునిపురంబు – తత్పార్శ్వమునయాతుధానపురము
పరగపృష్ఠనందువరుణునినగరంబు – పవనుపురంబునాపార్శ్వమందు
వామకర్ణమునందువరకుబేరపురంబు – హరునిపురంబువామాక్షియందు
గీ॥ శిరమునడుమునయుండుసుస్థిరముగాను – కుంఠితముగానినిదువైకుంఠపురము
రమ్యగుణధామభద్రాద్రిరామపరశు – రామనరసింహదాససంరక్షితాంహ్వ॥

* భావార్థము *

౬౯ భ్రూమధ్యమందు ఇంద్రపురము తూర్పుదిక్కు కుడికంటియందు అగ్నిపురము
ఆగ్నేయమూల కుడిచెవియందు యమపురము దక్షిణదిక్కు కుడిపార్శ్వమందు నైరుతి

పురము నైరుతిమూల కృష్ణును వరుణపురము పశ్చిమదిక్కు ఎడమపార్శ్వమందు వాయుపురము వాయువ్యమూల ఎడమచెవియందు కుబేరపురము ఉత్తరదిక్కు ఎడమకంటియందు శివపురము ఈశాన్యమూల ॥

* తత్త్వము *

పల్లవి

యిదుగో గురుకీలకము । జీవవిసర । అదుగో యోగసాధకము

అనుపల్లవి

యిదుగో శ్రీగురుపదద్వంద్వములను । హృదయములో పలవదలక యుంచితే ॥ యి ॥

చరణములు

కొండమీదను పెద్దగుండువున్నదిరా । గుండునడుమ రెండుగండ్లువున్నవిరా । గండ్లనడుమ సన్నగండిలోనయున్న । పండునుభవించితే ప్రజ్ఞానంబ్రహ్మగా ॥ యి ॥

ధాత్రిలోన వొక్క గాత్రమున్నదిరా । గాత్రమునకు దివ్యనేత్రమున్నదిరా । నేత్రమందు సుగుణసూత్రము గోయున్న । పాత్రమెరిగి తేచుబ్రహ్మహానుస్వారా ॥ యి ॥

చూపులోను శిలరూపమున్నదిరా । రూపములో వొక్క దీపమున్నదిరా । దీపములో వున్న తేజస్సుగలసితే । తాపములన్యణగి తత్వమసి యౌరా ॥ యి ॥

అయిదైదుయిరువదైయైదైయున్నవిరా । అయిదిటిమీదను ఆత్మవున్నదిరా । ఆత్మను మధియించి అమృతాము సేవించే । అనుభవమెరిగి తేలయమాత్మబ్రహ్మరా ॥ యి ॥

గురువాక్యములు నాల్గు గురు తెరుగనలేరు । గురు తెరిగినంతటా పరమాత్మారా । పరశురామునివరనరసింహయోగికి । పరమపదము బట్టబయలైయున్నదిరా ॥ యి ॥

* రామస్తవరాజము *

గీ॥ అధిపయినిసమ్మనుంగధరాగ్రమధ్య । వాహినడిమివికృష్ణాశ్రియద్వారవతిని
యాత్మదున్నాడుసూక్ష్మదృష్టిచాత । జ్ఞాతిగలవాడవగుకను సాంజ్ఞగాను ॥

క॥ పవమానబీజ మొక్కటి * కవగూడుక రెంటినడుమ * ఘననాదముచే
అవనినిఆరోదిక్కున * నవనీతపుబొమ్మవహ్ని * నడుమనటించు ॥

* దత్తయోగీంద్ర శతకము *

సీ॥ తరణీందుశిఖిశిఖాస్థానమై వెలుగొందు । వనరంగహృత్పీఠంబునై తనర్చు
సతతశృంగాటకస్థలమునై విలసిల్లు । కుండలీభవనమునై కొమరుమిగులు
నాలుగుత్రోవలనడుమనై చెలువారు । అరయనాపోజ్యోతియై చలంగు
ఆత్మబోధామంటపాంతర్గతానంత । వేదియై విఖ్యాతి వెలయుచుండు
గీ॥ అదియొకైవల్యమార్గమై యలరుచుండు । నట్టిచోనిన్నుగాంచగన్న యతడే ఘనుండు
చిరసుభాకారమోక్షలక్ష్మీవిహార । సాంద్రరుచిధుర్య దత్తయోగీంద్రవర్య ॥

* వేణుగోపాలశతకము *

సీ॥ వేదాంతమనుచు బ్రహ్మము తెల్చిన వెల్లు । నాదాంతసీమకునసుమ వెల్లు
సాధుజనానందసంపూర్ణమగు వెల్లు । బోధనిలయమై పొసగు వెల్లు
ద్విదళాబ్జమధ్యమందుదయమై బహు వెల్లు । సుషుమ్ననాళము నజొచ్చి వెల్లు
చూడచూడగ మహాశోభితంబగు వెల్లు । నిఖిలజగంబులనిండి వెల్లు
శతకోటిసారసాహితులమించిన వెల్లు । మేరుశిఖరాగ్రంబు మీద వెల్లు
గీ॥ అట్టివెల్లును మెప్పుడు బాహ్యాంతరమున । తెలియ నేర్చిన యతడే దేవుడనగ
మదిరెపురపాలము నిజనహృదయలోల । వేణుగోపాల భక్తసంత్రాణశీల ॥
సీ॥ భానుకోటిప్రభాభాసురంబగు వెల్లు । పరులు జూచిన గానబడని వెల్లు
గురుకృప చేగాగ గురుతు దెల్పిన వెల్లు । నమ్రత దృష్టి చేనమరు వెల్లు
విద్యుల్లతో పరివేష్టితంబగు వెల్లు । ఘననీలకాంతులు గ్రక్కు వెల్లు
దశవిధప్రణవనాదములు గల్గిన వెల్లు । మాను తెన్నగ గురియైన వెల్లు
గీ॥ ఆదిమధ్యాంతరహితమైనట్టి వెల్లు । ఇట్టి వెల్లును నిన్ను సేవించ నట్టి
వారి కేలలభించు కైవల్యపదవి । మదిరెపురపాలము నిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల ॥

* యోగవాశిష్ఠము *

సీ॥ శూన్యవాదులు కడుశూన్యతత్త్వంబన । బ్రహ్మవేత్తలు పరబ్రహ్మమనగ
విజ్ఞానవాదులు విజ్ఞానమిదియన । బారిసాంఖ్యయోగులు పురుషుడనగ
నెసగు యోగీశ్వరులీశ్వరుడితడన । శివమతాచార్యులు శివుడనంగ

కాలతత్వజ్ఞులు కాలరూపుండన । నాత్మార్థవిదులు చిదాత్మయనగ
గీ॥ తాదృశాత్ములు వైరాగ్యతత్వమనగ । మాధ్యమికులెల్ల నిదిమధ్యమంబనంగ
రమణసమచిత్తులెల్ల సత్వంబనంగ । నఖిలసిద్ధాంతసమ్మతంబగుచునమరు ॥

## * రాజరాజేశ్వరీయోగం *

### * ఈశ్వర ఉవాచ *

చక్షుర్మధ్యస్థితం సూక్ష్మం । అంగుష్ఠపర్వమాత్రకం । తదర్ధం చాపి సర్వార్ధం
తస్యాగ్రే సూక్ష్మకంధ్రవం । గుహ్యాద్గుహ్యతమం గుహ్యం । చక్షుస్థానేషు తిష్ఠతి
తన్మాత్రే లక్ష్యతే దృశ్యం । ఆపాదతలమస్తకం । అచలం నిర్మలం శాంతం । కా
యస్థం తేజ ఉచ్యతే । అమలం నిర్మలం దేవం । శూన్యవ్యాపి నిరంజనం । తజ్జ్యోతి
ర్విమలస్థానే । జ్ఞేయం ప్రత్యక్షగోచరం । పద్మగర్భం చ దృష్టం చే । త్సముక్తో
నాత్ర సంశయః । రక్తశుక్లం తథా కృష్ణం । నీలపీతాది శోభితం । తన్మధ్యే దర్శి
తం యేన । తజ్జ్యోతిర్బ్రహ్మకేవలం । భ్రూవోస్థానే అధః పద్మం । ద్విదళం తత్ర
శోభితం । హంక్షం ద్వ్యక్షరసంయుక్తం । వర్తతే వాయుమండలం । తన్మధ్యమం
తు జ్యోతిశ్చ । బిందురూపం విరాజతే । నీలతోయదమధ్యస్థా । ద్విద్యుల్లేఖేవ
భాస్వరా । నీవారశూకవత్తన్వీ । పీతాభాస్వత్స్వణూపమా । తస్యాశ్శిఖాయా
మధ్యే । పరమాత్మా వ్యవస్థితః । స బ్రహ్మ స శివస్స హరిః స్సేంద్ర । సోక్షరః పర
మస్స్వరాట్ । జ్వలత్కాలానలాభాసా । తటిత్కోటిసమప్రభా । తదూర్ధ్వం
చ శిఖా సూక్ష్మం । చిద్రూపం పరమం కళా । గురోర్ముఖేన జ్ఞాతవ్యం । అన్యథా
నోపలభ్యతే । కోటిసూర్యప్రతీకాశం । చంద్రకోటిసుశీతలం । యథా వేదేన
శాస్త్రేన । తథా పశ్యంతి సూరయః । ఆత్మజ్యోతిప్రభావేన । సోమసూర్యాది
భాసతే । అంతర్బహిశ్చ తత్సర్వం । వ్యాప్యతే సకలం జగత్ । యథోక్తం ద్విద
ళాకారం । చక్షుర్నామ్నేతి కథ్యతే । తన్మధ్యే సర్వసారంచ । దర్శయిత్వా మ
హామునిః । పశ్చాత్ప్రారబ్ధభోగేషు । నదేహాంతరమాప్నుయాత్ । సర్వేంద్రి
య సమాయుక్తం । సర్వదేహమవాప్నుయాత్ । చిదాత్మా సర్వదేహేషు
వ్యాప్యతే జ్యోతిరూపకం । తజ్జ్యోతిశ్చక్షురగ్రేచ । గురోర్నేత్రే చ పశ్యతి

సముక్తః సర్వలోకేషు । వేద వేదాంతనిశ్చితం । మథిత్వా సర్వశాస్త్రాణి । పార్వత్యాచ ప్రతిష్ఠితం । కాశీపురనివాసస్థా । విశ్వనాథో జగద్గురుః । దేహం తే చోపదిశ్యేత । దక్షిణే కర్ణసంపుటే । రాజరాజేశ్వరం యోగం । శేషమార్గం ప్రకాశ్యతే । యః పఠేత్ సతతం భక్త్యా । సముక్తో నాత్ర సంశయః ॥

* గద్య *

ఇతి * శ్రీసద్గురుప్రసాదే రాజరాజేశ్వరీయోగం సంపూర్ణం

* స్వరూపనిర్ణయం తారకస్థానం *

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురుః సాక్షాత్పరబ్రహ్మా । తస్మై శ్రీగురవే నమః ॥

శ్లో॥ హృదయకమలమధ్యే దీపవద్వేదసారం ।
ప్రణవమయమతర్క్యం యోగిహృద్ధ్యానగమ్యం ।
హరిగురుశివయోగం సర్వభూతస్థమేకం ।
సకృదపిమనసా ధ్యాయతే యః సముక్తః ॥

శ్లో॥ హృదయకమలమధ్యే భానుబింబాసనస్థం ।
సకలభువనబీజం సృష్టిసంహారహేతుం ।
నిరతిశయసుఖాఖ్యం జ్యోతిషం హంసరూపం ।
విమలపరమతత్వం చింతయే నాదిమూర్తిం ॥

శ్లో॥ హృదిస్థితం పంకజమష్టపత్రం । సకర్ణికం కేసరమింద్రనీలం
అంగుష్ఠమాత్రం మునయో వదంతి । ధ్యాయంతి విష్ణుం పురుషం పురాణం

శ్లో॥ ఆరాధయామి మణిసన్నిభమాత్మలింగం ।
మాయాపురీహృదయపంకజసన్నివిష్టం ।
శ్రద్ధానదీవిమలచిత్తజలాభిషేకై ।
నిత్యం సమాధికుసుమైర్నపునర్భవాయ ॥

శ్లో॥ తారకం స్థూలదేహశ్చ । దండకం లింగసంజ్ఞకం ।
కుండలీ కారణం చైవ । మహాకారణముత్తమం ।

బిందుర్విదేహా కైవల్యం । దేహానాంమీనపంచకం॥

శ్లో॥ అతసీపుష్పసంకాశం । త్రికూటస్యవ్యవస్థితం ।
దృశ్యతేబిందుమాత్రేణ । మహాకారణవృత్తమం ॥
ప్రమాణంమసురామాత్రం । నీలవర్ణంసుశోభితం ।
సునీలంజగదాధారం । జ్ఞాత్వామోక్షమవాప్నుయాత్ ॥
నీలంసునీలతాంచైవ । ధ్వనిమావార్ధమాత్రకా ।
త్రిణ్యార్ధవివరంచైవ । స్థూలంరక్తంచవర్ణకం ।
నేత్రస్థానేచదృశ్యంతే । జాగ్రదావస్థయాతథా ॥

శ్లో॥ అంగుష్ఠమాత్రంలింగంచ । శుభ్రవర్ణంచదృశ్యతే ।
అనయావరహితంధామ । స్వప్నావస్థాచఉచ్యతే ।
కారణాలక్షణర్వంచ । తమోఅజ్ఞానమేవచ ।
సంహార్వరమాంధకారంచ । కృష్ణవర్ణంసుచిప్రియే ।
ఇదంరహస్యాకరమం । గురువాక్యేనలభ్యతే ॥

* గద్య *

ఇతి కపిల గీతాయాం ద్వాదశోధ్యాయః

## —(* తారక వివరము. *)—

అంగుష్ఠమాత్రంహృదిపి । ఆహృధివేణుదూపం । అణురూపమే జ్ఞాననేత్రం । అజ్ఞాననేత్రంమధ్యను । వటబీజప్రమాణం అవకాశం అవకాశంశ్రుతిప్రమాణం "నివారశూకవత్తన్వి పీతాభాస్వస్త్వణూపమ" అనకాశం హంశ సఘంవిరాట్విగ్రహం । తతిమ్మాసఘం అంశ । అంగుష్ఠమాత్రం హృద్విలో ఆకాశములో వున్న వాయువుతోగూడా నఘ అంశ కలిశి మనస్సుఆయును । రవిలో అంశ అగ్నిలోకలిశి బుద్ధిఆయును । మనస్సులో అంశ వుదకములోకలిశి చిత్తమాయును । నాలుగోఅంశ హృద్వలో కలిశిఅహంకారమాయును । యీనాల్గుగూడితే అంతఃకరణమాయును । ఆస్థానమే ఆకాశంవల్లను శబ్దపంచకం ప్రాణాది పంచకం । జ్ఞానేంద్రియ పంచకం కర్మేంద్రియ పంచకం అంతఃకరణ చతుష్టయం చతుర్వింశతితత్వాని క్షరం । అక్షరమే జీవుడు । క్షరమే మనస్సు । మొదటి స్థూల

దేహమందు రక్తవర్ణమందు పీతవర్ణంపుంసను । యిదే స్థూలదేహం । దాని మీద శ్వేతకర్బూర వర్ణాలు సూక్ష్మ దేహం । దానిమీద కృష్ణ శ్యామల వర్ణాలు కారణ దేహం । దానిమీద నీలసునీలాలు మహా కారణ దేహం । దానిమీద శుద్ధపీతమే ఆకాశం । యీనాల్గు దేహాలకు అభిమానులు । రక్త వర్ణంగల జీవస్థూల దేహాలకు ఈశ్వరుడు అభిమాని । యిందులో శ్వేతవర్ణమైన ఈశ్వర దేహానకు విరాట్టు అభిమాని । యిందులో రక్త కృష్ణ కర్బూర వర్ణములైన ఈశ్వరసూక్ష్మదేహానకు తైజసుడు అభిమాని । యిందులో శ్వేత వర్ణమైన ఈశ్వర సూక్ష్మ దేహానకు । హిరణ్యగర్భుడు అభిమాని । కారణ దేహానకు రక్తవర్ణమైన జీవకారణ దేహానకు ప్రాజ్ఞుడభిమాని । కృష్ణవర్ణం గల ఈశ్వర కారణదేహానకు అవ్యాకృతుడు అభిమాని । మహా కారణానకు నీలవర్ణంగల జీవమహా కారణానకు ప్రత్యగాత్మ అభిమాని । ధూమ్ర వర్ణం గల ఈశ్వర కారణ దేహానకు స్వరాట్టు అభిమాని । యీయెనిమిది దేహాల లోపలను సునీలములో శుద్ధపీతమే మెరుక । అదే ఆకాశం । పంచభూతాత్మకమైన ఆకాశముగనుక కారణదేహానకు హేతువై జాగ్రతకుస్థానం । మూడు ఆవరణాలమధ్యన నేత్రస్థానం । జాగ్రదవస్థ । రజోగుణం । క్రియాశక్తి । అకార మాత్రిక । అకారబీజం । వైఖరీ పలుకు । బ్రహ్మ అధిదేవత । సూర్య మండలం । సూక్ష్మదేహ వివరం । అంగుష్ఠమాత్రం సూక్ష్మ దేహం । కంఠ స్థానం శుభ్ర వర్ణం । స్వప్నావస్థ । సత్వ గుణం । జ్ఞాన శక్తి । ఉకార బీజం । ఉకార రూపం । మధ్యమానాదం । చంద్ర మండలం । కారణం హృదయస్థానం । సుషుప్త్యవస్థ । తమోగుణం । ఇచ్ఛాశక్తి । మకారమాత్రిక । మకారబీజం । పశ్యంతి నాదం । రుద్రుడధిదేవత । అగ్నిమండలం । మూడుమండలాలనడుమసూక్ష్మద్వారములోపలనున్న విరాట్టు కారణ పురుషుడు । యిచ్ఛవలన అయిన ఆకాశం అదేస్వరూపం । అదే ఆపోజ్యోతి । అదేప్రణవం । అదేనాదబిందుకళలు । అదే వైకుంఠసత్యలోకాలకు ఆశ్రయస్థానం । అదేఅంతర్లక్ష్యం । అదేగగనముద్ర । అదేకైవల్యం । అదే వటబీజం । అదేజ్ఞాత । అదే జ్ఞేయం । అదేప్రజ్ఞానం । అదే ప్రత్యగాత్మ । అదేసూత్రాత్మ । అదే బోధాత్మ । అదే అంతరాత్మ । అదే పర

మూర్తి। అదేసాక్షి। అదేయిరువైయొక్కవెయ్యి ఆర్యాన్నర్ల అజపస్థానం। అదే హంస గాయత్రీ స్థానం। అ దేహంస ఉత్పత్తిస్థితి లయస్థానం। అదే బ్రాహ్మరంధ్రస్థానం। అదేహృదయాకాశం। ఆహృదయాకాశమధ్య వెలుగే దహరాకాశం। ఆవెలుగే క్షేత్రజ్ఞుడు। ఆక్షేత్రజ్ఞుడే స్వరాట్టు। ఆస్థానమే సుషుప్తిస్థానం। ఆస్థానమందే మండలత్రయాలు। స్థూలదేహమే సూర్యమండలం। సూక్ష్మదేహమే చంద్రమండలం। కారణదేహమే అగ్నిమండలం। మూడునదుల వివరం। నీలమధ్యముగావుండే బిందువే గంగ। నీలమే యమున। విద్యుల్లేఖే సరస్వతి। ఒకటికి ఈశ్వరదేహాలుమూడు। జీవదేహాలు మూడు। యిదే స్థూలదేహం। త్వంపదవాచ్యుడు జీవుడు। తత్పదవాచ్యుడు ఈశ్వరుడు। అన్నమయకోశం। దీనిమీదనీలనునీలాలు హిరణ్యగర్భుని నివాసస్థానం। బిందువు ఈశ్వర సూక్ష్మదేహం। బ్రహ్మాండ అకురుడు। తత్పదవాచ్యం। ప్రాణమయ మనోమయ। విజ్ఞానమయానందమయాన్నమను కోశం తనుత్రయం। అతసీపుష్ప ఆకాశం ప్రకాశితం। ప్రత్యక్ అసిపదం। మహా కారణమానందమయ కోశం। మూర్ధ్నిస్థానం। లింగే సుషుప్తి। తుర్యావస్థ। శుద్ధసత్వం। పరాశక్తి। ఓంకారమాత్రక। యకారబీజం। బిందుస్థానం। నీలమేఘ మధ్యమే ఆపోజ్యోతి। నీవారశూకరూపం। యిదేకారణమైన విరూపాక్షస్థానం। యిదే అగ్నిశిఖయు। యిటమీద। నీలతోయదమధ్యస్థమైనవిద్యుల్లేఖ। యిందుకు వటబీజపరిమాణమై అతిసూక్ష్మరంధ్రమై। చక్షుస్సులయందు అంగుష్ఠమాత్రములో వుండును। ఉత్తమ పురుషుడై ప్రకాశించివుండును। యిదే బ్రహ్మాండశోధన। యిదే ఉన్మని। యిదే మనోన్మని। యిదే అమనస్కస్థితి। అసిపదస్థానం యిదే దేహశోధన। అష్టధాప్రకృతిరితావార్యః। భిన్నాప్రకృతిరష్టధాస్థానం షోడశకళాత్మకమైనదే చిత్తు। జ్యోతిరాకారమే సత్తు। రెండూకలసుటే ఆనందం। షోడశ కళాత్మకమైనదేహి నవవర్ణాత్మకమైనదే శుద్ధ పీఠం। యిదే తారక వివరం। ఇది శ్రీగురుకృపాపాత్రులకు లభితం॥

శ్లో॥ ఏకోహందంజగత్సర్వం ఽ మేకముద్రాచఖేచరీ
ఏకమేవపరబ్రహ్మ ఽ గురురిత్యక్షరద్వయం॥

—(*) నా ర దో త్త ర సం వా దే వ ర్ణ క్ర మం. (*)—

గీ॥ దృష్టిదృగ్దృశ్యమందునదృశ్యముగను ॥ యేడుకోటలు యేర్పడియుండునచట
ఆత్మయున్నట్టిశిరంగహర్మ్యగృహము ॥ దేహమునజూడుదేశికుకరుణచేత ॥

కం॥ తెలిపెదరహస్యార్థంబులు * తెలిపెదవినుమనీవుతేట * తెలివిగయిపుడున్
తెలిపెదవైకుంఠునిగన * దెలిపెదఆత్మార్థఫలము * తెలివిగవినుమీ ॥

వ॥ మరియు మదీయంబైన పదంబునకు అపరిమిత పారావారంబై సహస్రభుజ
ముఖ సకిరీట కుండలధారియైన శ్రీజగన్నాథుని శ్రీవైకుంఠ మందిరునకు.

—(*) అం డ పిం డ బ్రహ్మాం డా లు. (*)—

అండాండమనగా ఆదిత్యతేజోవిశాలంబైన దృక్కు పిండాండమనగా బిందువ
నెటిపాప బ్రహ్మాండమనగా బిందువనెటి పాపమధ్యమున వెలిగేకళ ఆకళలో
నిమ్కళే పరబ్రహ్మం యీపరబ్రహ్మంబునకు పృథివ్యాపస్తేజో వాయురా
కాశముల నెటి పంచభూతంబులకు వివరం.

* పం చ భూ తా లు. *

దృష్టిదృగ్దృశ్య రూపంబైన ఆత్మ ఆఆత్మకు ప్రథమావరణంబైన మెరుపు పృథివి
ఉదకమనగా ద్వితీయావరణంబైన తెలుపు అగ్నియనగా ఆవరణతృతీయంబైన
నలుపు వాయువనగా చతుర్థావరణంబైన ఆత్మ సునీలమైన పాప ఆకాశ
మనగా ఆవరణ పంచకంబనెటి కళ పరమపురుష పరబ్రహ్మమనెటి యీపర
మపురుషునకు త్రివేణి సంగమంబునకు వివరం.

* త్రి వే ణి సం గ మం. *

గంగఅనగా తృతీయావరణమున వున్న నలుపు యమున అనగా చతుర్థావరణం
బులో నీలతోయదమధ్యస్థంబనెటి పాప అదే కుండలీస్థానం సరస్వతి అనగా
పంచమావరణంబనెటి పాప నివాసంబున వెలిగే కళ అదే విద్యుల్లేఖ యీ
కళలో నిమ్కళే నిరాకార నిరంజనమనెటి సద్గురుడు యీపరబ్రహ్మంబునకు
ఆత్మ హరిహరహిరణ్యగర్భంబైన వివరం.

* మూర్తిత్రయం. *

ప్రథమావరణంబైన మెరుపు బ్రహ్మ ద్వితీయావరంబైన తెలుపు సదృశు తృతీయావరణంబైన నలుపు విష్ణువు వీరుముగ్గురు అకార ఉకార మకారాత్మకులై యున్నవారలు యిదే కూటస్థానం యిదే హృదయకమలం యిక్కడనే నిద్ర సంగమాదులు ఉత్పత్తి అవును ఆఓంకారానకు పరంబిఃశబ్దనిష్కళే పరబ్రహ్మం నిష్కళాంతే గురుస్వరూపం గురుస్వరూపానకు పంచశక్తులు వుదయించెను.

* పంచశక్తులు. *

ఆదిశక్తి అనగా ప్రథమావరణంబైన మెరుపు జ్ఞానశక్తి అనగా ద్వితీయావరణంబైన తెలుపు యిచ్ఛాశక్తి అనగా తృతీయావరణంబైన నలుపు క్రియాశక్తి యనగా చతుర్థావరణంబైన పాప పరాశక్తి యనగా పంచమావరణంబున వెలిగే కళ ఆకళలో నిష్కళే సద్గురుండు యీపరబ్రహ్మంబునకు రేచక పూరక కుంభక సూచకములను వివరించెద.

* రేచక పూరక కుంభకాలు. *

రేచకమనగా ప్రథమావరణంబైన మెరుపు పూరకమనగా ద్వితీయావరణంబైన తెలుపు కుంభకమనగా తృతీయావరణంబైన నలుపు సూచకమనగా చతుర్థావరణమైన పాప సూచనమనగా పంచమావరణంబున వెలిగే కళ ఆకళలో నిష్కళే పరబ్రహ్మం యీపరబ్రహ్మంబునకు మండలత్రయాలు వివరించెద.

* మండలత్రయాలు. *

అగ్నిమండలమనగా తృతీయావరణంబైన నలుపు సూర్యమండలమనగా చతుర్థావరణంబైన సునీలమైన బిందువ చంద్రమండలమనగా పంచమావరణంబైనకళ యీకళలో సర్వప్రపంచమున్నఅగుపడే చంద్రమండలం ఆకళలోనిష్కళే మెరుకమరుపుల మెరిగే సద్గురుండు సత్తుచిత్తుఆనందంబులకు వివరం.

* సత్తు చిత్తు ఆనందం. *

సత్తు అనంగా పంచమావరణంబులో కళలోదీప్తి చిత్తుఅనగా చతుర్థావరణం

బనెటి పాపనున్ను బాహ్యానకు యెదుటలగుపడే వస్తువలన్ని చిత్తుగదాయని బిందుపను పాపయందు నిరంతరమున్ను మనస్సుస్థిరపరచి రెప్పపాటు లేకుండా సగుణనిర్గుణముల రెంటికిన్ని సాక్షిభూతుండైన సద్గురుండు లోకసాక్షాత్పర బ్రహ్మాంబని యెంచి అందునిలిపి చతుర్బాహుండును సంతుష్టాంతరంగుండును శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గకోదండధరుండును స్వర్ణకిరీట కుండలాభరణ భూషితుండును నీవని యస్మద్దేశికుని యెంచి పూజించి అవాఙ్మానస గోచరంబునందు కనక సింహాసనాసీనుగా జేసి " అంతర్బహిశ్చతత్సర్వం । వ్యాప్య నారాయణస్థితః " అనెటి శృతివాక్య ప్రమాణంబున నుండవలయు యీపరబ్రహ్మంబునకు తత్పద త్వంపద అసిపదంబుల వివరించెద.

* తత్వమసి వాక్యార్థం. *

తత్పదమనగా ప్రకాశమానమైన తేజస్సు త్వం పదమనగా జీవ తత్వమైన బిందువు అసిపదమనగా బిందువుయందు మనస్సు స్థావరపరచి ఆలోని నిష్కళతానై అందు గురుస్వరూపములో తాను విలీనమై పొందుటమే అసిపదం ఆవిరాడ్యాకంబుదెలసి అస్మద్దేశికుని నాదబిందు కళలు వివరించెద.

* నాదబిందు కళలు. *

నాదంఅనగా చతుర్థావరణంబైనసీలం బిందువనగా పంచమావరణంబైననీలములో లీనమైనపాప కళయనగా షష్ఠావరణంబైన సత్కాంతి ఆకళలో నిష్కళేతానైన పరబ్రహ్మం యీపరబ్రహ్మంబునకు యిడా పింగళ సుషుమ్నలు.

* యిడా పింగళా సుషుమ్నలు. *

యిడయనగా తృతీయావరణంబైన నలుపు పింగళయనగా చతుర్థావరణంబైన నీలమైన బిందువ సుషుమ్నమనగా పంచమావరణంబులో నీలమైనపాప ఆపాప మధ్యమునవిల్వేది మూటికటింప సూక్ష్మరంధ్రం ముజ్జగవ్యాపకమై సర్వ పరిపూర్ణమై లోపల వెలుగల ప్రకాశింపుచున్నది అదేనాడినాళము అదేభ్రూమధ్యస్థానము అదేబ్రహ్మరంధ్రం అదే మేరుశిఖరం అదే పాలసాగరం అదే

ఆపోజ్యోతి అందు ప్రకాశింపుచున్నది సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య. సాక్షిప్యంబనెటి ముక్తి పంచకంబునకు వివరం.

* సా లో క్యా ది ము క్తు లు. *

సాలోక్యమనగా ప్రథమావరణంబైన మెరుపు సామీప్యమనగా ద్వితీయావరణంబైన తెలుపు సారూప్యమనగా తృతీయావరణంబైన నలుపు సాయుజ్యమనగా చతుర్థావరణంబైన సునీలమైన సాక్షిప్యమనగా పంచమావరణంబైన కళ ఆకళలో నిష్కళే గురుస్వరూపం యీపరబ్రహ్మంబునకు మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధాగ్నేయంబులనెటి షట్చక్రంబులకువివరం.

* ష ట్చ క్రా లు. *

మూలాధారమనగా ప్రథమావరణంబైన ఆత్మస్థ నమంతా ఆధారచక్రం గణపతి అధిదేవత స్వాధిష్ఠానమనగా ప్రథమావణంబైన మెరుపు బ్రహ్మ అధిదేవత రాజసగుణం మణిపూరకమనగా ద్వితీయావరణంబైన తెలుపు విష్ణు అధిదేవత సత్వగుణం అనాహతమనగా తృతీయావరణంబైన నలుపు శివుడధిదేవత తమోగుణం విశుద్ధమనగా చతుర్థావరణంబైన బిందువ మనోగుణం జీవుడధిదేవత ఆజ్ఞేయమనగా పంచమావరణంబైన కళ పరమాత్మ అధిదేవత అందు నిష్కళే గురుస్వరూపం అందు కిరణములే సహస్రార కమలము యీవిరాడ్రూపంబునకు అష్ట తనువులు.

* అ ష్ట త ను వు లు. *

ప్రథమావరణంబైనమెరుపు ద్వితీయావరంబైన తెల్పు తృతీయావరణంబైన నల్పు చతుర్థావరణంబైన మెరుపులో తెల్పు పంచమావరణంబైన తెల్పులో నల్పు షష్ఠావరణంబైన కపిలవర్ణం సప్తమావరణంబైన సునీలం అష్టమావరణంబైన స్ఫటికవర్ణం.

* త్రి పు టు లు. *

యీవిరాడ్రూపంబునకు అంతర త్రిపుటి అతిరహస్యం సునీలం స్ఫటికవర్ణం దీప్తి యీమూడింటికావల "చంద్రమామనసోజాతః" అనెటి శ్రుతివాక్య ప్రమాణంబునకు అతిరహస్యంబు నీకెరింగించితినిది.

గీ॥ అంతరాత్ముడనెటి ఆనందపదవి । అంతరాత్మగనవె ఆనందము గాను
ఆత్మబొందితివేని యానందలహరిలో । అదియుమిణ్ణువనుచు ఆత్మగనుమీ ॥

గీ॥ అలసిపోంక గూడి యావిష్ణుపదములు । మొరుగదెలిపితినమ్మ మొనుచాత
మొగుక తెలిశనివు యేకాంతభావంబు । పొందుమనుచు జెప్పి పోమొనతెను ॥

## * సాంఖ్య విచారము. *

నిరామయమైనట్టువంటి పరమాత్మయందు ఆమాయా శబలంబైనట్టువంటి మూల ప్రకృతిబుట్టె ప్రకృతి రెండు భాగాలాయె శుద్ధానకు ప్రకృతిఆయె శబలానకు మాయఆయె ప్రకృతియందు ఆకాశంబుట్టె ఆకాశం రెండు భాగాలాయె శుద్ధానకు ఆకాశమాయె శబలానకు అంతఃకరణఆయె ఆకాశమందు వాయువు బుట్టె వాయువు రెండుభాగాలాయె శుద్ధానకు వాయువాయె శబలానకు మనస్సాయె వాయువందగ్నిబుట్టె అగ్ని రెండు భాగాలాయె శుద్ధానకు అగ్నిఆయె శబలానకు బుద్ధిఆయె అగ్నియందుదకంబుట్టె ఉదకం రెండు భాగాలాయె శుద్ధానకు ఉదకమాయె శబలానకు చిత్తమాయె ఉదకమందు పృధివిబుట్టె పృధివి రెండు భాగాలాయె శుద్ధానకు పృధివిఆయె శబలానకహంకారమాయె పృధివియందోషధులు బుట్టె ఓషధులు రెండు భాగాలాయె శుద్ధానకు ఓషధులాయె శబలానకుత్వగ్గోత్రమాలాయె ఓషధులందన్నంబుట్టె అన్నం రెండుభాగాలాయె శుద్ధానకు శ్వేతమాయె అన్నమందు రేతస్సుబుట్టె రేతస్సు రెండు భాగాలాయె శుద్ధానకు శ్వేతమాయె శబలానకు రక్తమాయె రక్తశ్వేతోభయములుగూడి పురుషుడాయె పురుషుడు రెండుభాగాలాయె శుద్ధానకు ఈశ్వరుడాయె శబలానకు జీవుడాయె జీవేశ్వరులు ఉభయులూగూడి విశ్వమాయె విశ్వం రెండుభాగాలాయె శుద్ధానకు పారమార్థికమాయె శబలానకు ప్రపంచమాయె ప్రపంచ పారమార్థికాలు ఉభయులూగూడి పృధివియందు లయమాయె పృధివ్యుదకమందు ఉదకమగ్నియందు అగ్ని వాయువందు వాయువాకాశమందు ఆకాశమంతఃకరణందు అంతఃకరణప్రత్యగాత్మయందు ప్రత్యగాత్మ పరమాత్మయందు లయమాయెనని యెరుగవలెను.

# దృక్స్థాన విమర్శ.

* జీవతను చతుష్టయము. *

| వర్ణం | దేహం | గుణం | అభిమాని | అవస్థ | మాత్రిక | స్థానం |
|---|---|---|---|---|---|---|
| మెరుపు | స్థూలం | రజోగుణం | విశ్వుడు | జాగ్రత | అకారం | నేత్రం |
| ధవళం | సూక్ష్మం | సత్వగుణం | తైజసుడు | స్వప్నం | ఉకారం | కంఠం |
| కృష్ణం | కారణం | తమోగుణం | ప్రాజ్ఞుడు | సుషుప్తి | మకారం | హృదయం |
| నీలం | మహాకారణం | శుద్ధసాత్వికం | శుద్ధజీవుడు | తుర్యావస్థ | ఓంకారమాత్రిక | భ్రూమధ్యం |

యిది అంతా త్వంపద లక్ష్యార్థము, దీనిపేరు కార్యం అనబడును.

—(*) ఈశ్వరతను చతుష్టయం. (*)—

| వర్ణం | దేహం | గుణం | అభిమాని | అవస్థ | మాత్రిక | స్థానం |
|---|---|---|---|---|---|---|
| మెరుపులో పీతం | విరాట్టు | రాజసాహంకారం | బ్రహ్మ | ఉత్పత్తి | అకారం | రవిమండలం |
| తెలుపులోని కర్పూరం | హిరణ్యగర్భం | సాత్వికాహంకారం | విష్ణు | స్థితి | ఉకారం | చంద్రమండలం |
| కృష్ణంలోని శ్యామం | అవ్యాకృతం | తామసాహంకారం | రుద్రుడు | ప్రళయం | మకారం | వంహ్నిమండలం |
| నీలంలోని స్ఫటికంకళ | మాయాదేహం | శుద్ధసాత్వికం | ఈశ్వరుడు | సర్వసాక్షి | ఓన్నమః | అర్ధచంద్రమండలం |

యిది అంతా తత్పద లక్ష్యార్థం యిదే బ్రహ్మాండం యిదే సమష్టికి కారణం

యీజీవేశ్వరుల అష్ట తనువులమధ్యన ఆడుచుండే సత్ప్రభగల జ్యోతి యేదిగలదో అదే అసిపదమనంబడును అదే "తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః" అని శృతిబలికిన తాను యీఅష్ట తనువులయొక్క అగ్రమందేగల చిద్బయలు యందు లియ్యమైపోవలసినది అదియేలాగంటే ఘటాకాశ మహాకాశములు ఘటమఠాల గీశి చూస్తే వేరులేనట్టు యిది యింతాగూడి తత్వమసియనే వాక్యానులక్ష్యార్థం.

* కందార్థము. *

౧౦౪ * తనువుతోవచ్చిన యెరుకే * తనువుమతనువనుచుతనను * తానని యెరుగుక్ తనువును భాసించమీదట * తననా దేహమును రెంట్ని * తానెరుగదపుడూ * అదిగను కాతా * లేనేలేదెపుడూ * అనుమానరహితామిం * దచలాయున్నదికొంటె * తన మాటదలపోయ తనకేసిగ్గితనను * తానెరుగదపుడూ * అదిగనుకాతాలేనేలేదెపుడు

* కందార్థము. *

౧౦౫ * ఉప్పెనచే జెనుతరువు * వోకప్పుడు కీర్తనముబుచ్చు * నారెంటికియీ తిప్పలు దప్పవుధరయే * తిప్పలుతానెరుగిదట్లు * తెలుసూగదోయీ * తను వెరుకా బయలులనక్లైరుగోయీ * గొప్పైనగురుబోధా చొప్పున నెరిగిపై * తిప్పలుగల నాటిన్ని తప్పాదీసి తెజాలు * తెలుసూగదోయీ * తనువెరుకాబయలులనక్లైరుగోయి

* గద్య *

ఇతి * శ్రీమద్భాగవత కృష్ణవిరచిత ద్వైతాద్వైత రహిత పరమతత్వ,
శక్తిద్వయ నిరాసకంబైన శిద్ధనిర్గుణతత్వ కందార్థానేక
సదృష్టాంత ప్రకాశిక యందలి యెరుక మోక్షణంబను,

షష్టోధ్యాయము.

శ్రీ గురుభ్యో నమః

శ్రీమద్భాగవత కృష్ణదేశిక విరచిత శక్తిద్వ

# శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టి

(మతాలలక్షణం.)

* కందార్థము. *

(౧౦౬)* మతములవారలు తమసం ♦ మ్మతమైనటువంటి శాస్త్ర ♦ మర్యాదలచే మితమేరుపరచుకొనిబహు ♦ గతులనుకలహింతురట్టి ♦ గతినీకేమిటికి ♦ చపలతజెందె స్థితినీకేమిటికి ♦ ప్రితిలేనియీబట్ట బయలుండజూచిసం ♦ తతములేనెరుకలేదనినమ్ముమి కవారి ♦ గతినీకేమిటికి ♦ చపలతజెందె ♦ స్థితినీకేమిటికి ॥౧॥

కం॥ పాషండమతమువారల । వేషంబులుజూచిశిష్య । వితతిభ్రమించున్ ।
ఈషత్తీబోధెరుగక । దూషింతురువిన్నకన్న । దుర్భాషణలన్ ॥

సీ॥ న్యాయమీమాంసవేదాంతతర్కవిశేష । చార్వాకశాస్త్రాదిషణ్మతములు ।
బ్రాహ్మణజైనకాపాలికజంగము । సన్యాసపంధ్యాదిషణ్మతములు ।
శైవవైష్ణవబౌద్ధసౌరగాణాపత్య । శాక్తేయతంత్రాదిషణ్మతములు ।
ఱు విగూడపదునెనిమిదేపారషడ్దర్శ । నత్రియంబనగనీధాని

నక । భక్తినీయందుగలవాడు శ్రేష్ఠుడగును ।
త్రవిహార । సాంద్రరుచిభుర్వద త్తయోగీంద్రవర్యా॥

## వాక్యబోధద్విపద

### —( జంగాలు )—

గాదాడిగి * వాంక్కరశంఖంబు వాకచాతబట్టి ।
ంజిదెబూశి * పారముదెలియక బ్రింహ్మానుభవము ।
ంలింగమనూచు * తిరుగుచుందురుగాని దేహంబులోన ।
ందుకోలేరు ॥

### —( వైష్ణవులు )—

ఊపత్రిసాంబు తట్టెడుదినియు * పట్టెవర్ధనములు బాగుగాదిర్చి ।
కట్టినవస్త్రముల్ కడుతెల్లజేసి * యిట్టట్టుదిరుగుచూ యేముశ్రీవిష్ణు ।
భక్తులమనుచును పరమపదమైన * ముక్తియుగానక మురియుచుందురు ॥

### —( మధ్వలు. )—

మరియునుకొందరు మధ్వలమనుచు * నరగునముద్రలు చాతనూబట్టి ।
అమరంగదాల్చిన నంతయోమోక్ష * మునుగలుగు ననెభ్రాంతివలుగుటేకాని

### —( వేషదారు )—

పుడమిలోకొందరు భూతియుబూశి * పన్నుగాజడలును బాగుగాగట్టి ।
తన్నుతాతెలియక తనవారివిడచి * వుండయిల్లునులేక వుపవాసములాను ।
పండమంచములేక పంచలాబండి * పర్వతంబులుగుహాలు బహువనంబులూను
వేశ్వేరదిరుగుచూ వేసటబడుచు * ఆకులలములు ఆకలిదీర్చి ।
...రుగుచు కడుఅవస్థలాను * బడిపొరలుటేకాని పరమందలేరు

విడిబడికొందరు వేత్తలామనుచు * కుండకోలయుబట్టి నిండవిభూతి।
మెండుగాబూశియు మెడనురుద్రాక్ష * మాలికల్ ధరియించి మార్గముల్ బట్టి।
హోరులు నెముకుచు పోడుదురుగాని * బ్రహ్మమందాత్మైక్య భావమెరుగకాన

అద్వైతులు

జంహ్మకురుచిగ భోంచె సేటికొరకు * జుట్టుజంధ్యముచీసి చోద్యమాకావి
బట్టలుచుట్టుక చుట్టాలబాశి * జపమాలధరియించి శ్రీహరిస్మరణ।
నేపముగాత్రిప్పుచూ నేత్రముల్ మూశి * నారాయణాయనుచు నరులుచూ
(గాను।
పూరూరనోకనాడు నుచితముగనుండి * భక్ష్యభోజ్యంబులు పక్వాన్నమూలు।
భిక్ష సేయుచుతాము భక్షింపుచూను * వుండుటయే కాని ఉచితమైనట్టి।
అఖండభావంబు కానకవారు * ముక్తిజెందెదమనుచు మురయుచుండుదురు॥

—( శ్రీ శి వ రా మ దీ క్షి తీ య మ ను బ్ర హ్మ ద్వా శి ష్టం )—

* అ చ ల బో ధ సి ద్ధాం తం *

శం. మల్లాకలలో వక్క సన్యాశి వచ్చె।
రా. వెంటనే పెద్ద పట్టెనామాల అయ్యవారు। పుస్తకం చంకబెట్టుకొని వచ్చె।
మ. తరువాత అడ్డకపుబట్టవలే వున్న మనిష్యి వచ్చే।
అ. అష్టవంటిఅయనే ముసలిఆయన వచ్చె।
ప. వీరినీ చూతామని। నెన్ను ఫక్కీరు వచ్చే। వచ్చి। మీరునలుగురు నాలుగు విధాల పెట్టుకున్నారు। మీకుమీరే పెట్టుకున్నారా। మీకుయెవ్వరైనా చెప్పినారా। అనీ। అంటె।
శం. విభూతి చమటచాత తడిసి పోయింది। గనక। పక్కీరువలె వున్నాడు।
ప. యీయన మనమతంవాడే। అనుకొనే। అనుకొని। నెత్తి చూచే। రొమ్ము చూచి। మనసంమ్మంధమె అనుకోని। మీకులంయేమి। అని అడిగె।
శం నాకు కులంలేదు। గోత్రంలేదు। అనే।

ప. లేదని నీకేమెరుక । నీకు మరివకుడు యెవ్వడైనా చెప్పెనా । అనే ।

శం. నాకు చెప్పేవారు యెవ్వరు । నాకంటె వేరే యెవరు లేరు । నేనే అందరిలో వుండి యెరిగెవాణ్ణి । నేనే నేను । సమస్త నిర్ణయాలకు కర్తను । నేనే నేను । అనే ।

ప. అయ్యవారూ నీవేమయ్యా అనే । వార్ని నీవు యేమనా । నిర్ణయం చేసినా వయ్యా । అనే ।

. నేను నిబద్ధి । శరీరం అబద్ధం । అని నిర్ణయం చేసినా ।
అబద్ధమంటె । లేదు అనుట । ఆమైతె పుట్టిందినీవా । శరీరమా ।

రా. శరీరమే । నాకూ పుటుకా లేదు । చావూ లేదు । సార్వకాలం వొకతీరే ।

ప. నీవు చెప్పవయ్యా, అయ్యవారు ।

అ. సరే । కాని । నేను వేరే శరీరం వేరే అన్నారు । వారు । మేము । నేనూ శరీరం వొక్కటే అన్నాము । నన్ను విడచి । శరీరం వుండదు । శరీరాన్ని విడచి నేను వుండ నాలోకలశి వున్నది శరీరం । శరీరంలో కలశి నేను వున్నా । యింతెకాని । రెండూ కావు వొక్కటే కాదు । శిలా । ప్రతిమ । యీలాగే । ఆలాగే । ఫక్కీరా । అయ్యవారును । అడుగుమా । వ్యవహారం చేశేదీ । శిలా । ప్రతిమా । అడుగుమా ।

రా. మా శిద్ధాంతం వకటీ కాదు । రెండూ కావు । విశిష్టం । ఫక్కీరా । వ్యవహారం అడిగితివి । మీ వార్ని । అడుగు ।

ప. వారు మావారా ।

రా. యేమీ యక్కడ తక్కడ । జుట్టు లేదు । జంజ్యాలు లేవు ।

ప. అదీ యేమయ్యా । అనే । సంన్యాశి । వ్యవహారం నీవూ చేస్తావా । శరీరం చేస్తుంద్దె ।

శం. నేను యేమీ చేస్తా । నేను క్రియాసూన్యుణ్ణి । అకర్తను । అభోక్తను । నేను । యేమీ చెయ్య । అన్ని దేహధర్మాలే । దేహమే చేస్తుంది । అనే ।

ప. అనంగ్గానే । ఫక్కీరు । నవ్వె । నవ్వి । అద్దకపు బట్టవంటి । మనిషీ । నీవేమయ్యా । అనే ।

మ. ఛీ ! శరీరం యేమీ చేస్తుంద్ది । సకలమైన వ్యవహారాలకు । కర్తను । గురెఱిగేవాణ్ణి । శ్లో॥ జ్ఞాత్వా కర్మాణి కుర్వీతా । అనివున్నది । సమస్తమైన వ్యవ

హారాలు నేనేకాని । స్వతంత్రుణ్ణి కాను ।

ప. నీకంట్లె । వేరు మరివాళ్లు వున్నారా ।

మ. వున్నారు ।

ప. గురువును । యెరిగినవారా । యెరుగనివారా ।

మ. యింత్తమాత్రిద్దాత్తం ।

ప. ముసలిమనిష్యి నీవేమయ్యా । నీవునిబద్ధే । శరీరంనిబద్ధే । అనే ।

భా. నేనునిబద్ధే । శరీరంనిబద్ధే । నేనులేనిది శరీరంచెయ్యదు । శరీరంలేనిది । నేను చెయ్యా । గుత్తెరిగేనేనుజ్ఞానం । శరీరంచేసేది కర్మం । జ్ఞానంనిబద్ధే । కర్మాలునిబద్ధే । ద్వైతంనిబద్ధే । అద్వైతంనిబద్ధే ।

ప. ఫక్కీరు నవ్వి । మీరుయక్కడికి పోతారు । అనే ।

శ.రా. మేమూనలుగురం । నాలుగుబాటలవారం । మాకూయేమీ ప్రయోజనం

మ.భా. లేదు । సకలవిద్యలు చదువుకున్నాము । చెప్పుదామంటె చదువుకునేవారు లేరు । శ్రవణమైనా చేతామంటే । వినేవారులేరు । యెవరైనా వొత్తురేమో అని వస్తే । నలుగురూ నాలుగు తెల్లుగా । చేతామనివున్నాము ।

ప. ఫక్కీరు । యవ్వరైనావచ్చేరు । రావలెనని తపస్సు చెయ్యమని చెప్పిపాయ ।

శ రా. యీనలుగురు । యక్కడజూచినాయవ్వరులేరు । యేమీలేదు । అని । వుండిరి

మ.భా. వుండంగా వుండగా ।

—( మ తా ం నా రు )—

అనేకమంది బూడిదిబూసుకొని । వచ్చిరి । అనేకమంది నామాలవారు । వచ్చిరి । అనేకమంది నాలుగువిధాల । వచ్చిరి । రాంగ్గానే । వినవలెనని । యిచ్ఛపుట్టి పుట్టంగ్గానేవినిరి । మనమూయిలాగే ! కొంద్దరికి । చెప్పుదామని । పుస్తకాలు వారివారిసమాదానంగ్గా । శానావ్రాసుకొనిరి । వ్రాసుకొని చదువుకుంటూ । చెప్పుకొంటూ । వుండిరి । వుండంగ్గా వుండంగ్గా ।

—( ప్రపంచసృష్టి )—

అనేకకోట్లకొద్ది । స్త్రీలువచ్చిరి । అనేకమైన ఆబరణాలు । అనేకవస్త్రాలు । అనే

కమైన గుర్రాలు । రథాలు । అనేకమైన బానిశవాండ్లు । మంటితపుకులోయెక్కి
అధాత్తునావచ్చిరి । రాంగ్గానే । చదువులు చాలించ్చి ! చెప్పేవారితోకూడా !
మోహపడి ! రతికర్మాలు చాయబట్టిరి ! యిలాగు వుండంగా ! ఆవులు । బఱ్ఱె ।
మేకలు । అనేకకోట్లగొర్లు । కానే వాండ్లతోకూడా । వచ్చిరి । వచ్చేవరకూ ।
యీమంటితపుకులో । యక్కడచూచినా । నదుములబింటిగడ్డి । యక్కడినుంచో
పెద్దపులులువచ్చె । అవ్వి రాంగ్గానే । యీమంటితపుకులో !అనేకమైన । ఘుట్లు ।
గుట్టలు । గృహాలు । వచ్చె రాంగ్గానే ! పులులు ప్రవేశించ్చె । యీప్రకారానా
అనేకదినాలు గడిచె । దానిమొదలు యెవ్వరికి తెలియదు । కొనయెవ్వరికి తెలి
యదు । యిదియంత్రఘటితం ! అందరికి తెలియకుండా ।

శం. రా. మ. భా.) నలుగురూ । యీమూలంలేని । యీగుతేఁరిగే శరీరానకు ।
మూలంవున్నదీ ।అనీ । యీమూలంలేని యీగుతేఁరిగే । శరీరంనేనుఅనీ । నిశ్చయం
గలవారు ! కొనకు ! మూలంలేనియీగుత్తేరిగేశరీరానకు ! ప్రవేశించెటందుకూ ! స్థా
నంవున్నదిఅన్నారు । మళ్లావస్తుందిఅనిఅన్నారు । మూలంలేనియీగుతేఁరిగేశరీరానకు
మోక్షమనిమురిపించినారు । మూలంలేని యీగుతేఁరిగేశరీరమే । యిన్నిమాగాఁలు
చేశింది [చెప్పేవారికి చెటుఅయితే వినేవారికి జాగ్రత వుండవలె ! ]

గు. అందరికీ । యీమూలంలేని । యీగుతేఁరిగే । శరీరం । ప్రతిదినమందూ ।యే
మీలేదు । కలలోవచ్చినవాణ్ని । ఘుట్టిగా ! కట్టివేసుకున్నట్టు । మళ్లా మళ్లాఘుట్టిగా ।
నన్నేకట్టివేసుకుంటారు । యీదుఃఖంనాకుయేమీఅని । అందరుచూడంగ్గానే । మూలం
లేనియీగుతేఁరిగేశరీరం । కొనకుయేమీలేదు । మూలంలేని ఈగుతుఁరిగేశరీరం ।
ప్రతిదినమందూ । యేమీలేదు । కొనకూయేమీలేదు । యేమీలేనిదిఅపకీర్తి ।సుషు
ప్తిఅని । కల్పించినారు। కొనకుమరణమని కల్పించినారు । తల్లికి అలవాటైనపిల్లకు ।తల్లి
కొనకుచస్తే । ఆపిల్ల । అంమ్మాఅంమ్మా । అని । యాదిచేస్తే । నీళ్లకుపోయింది । జియ్యా
చేసిరానుపోయింది । అన్నట్టు । మూలంలేనియీగుత్తేరిశగేరీరం । స్వర్గానకుపోయింది
నరకానకుపోయింది । అని । కల్పించ్చినారు । నేనురానేరాను । వస్తినా । కాశేపువుండి
మీకుతెలిశేటట్టూ । మళ్లా యేమిలేదు । అని । నిశ్చయమయ్యేటట్టు । కలలోవచ్చి
కాశేపు । మీతోకూడావుండి । మీరుఅషుమొఖంకాంగ్గానే । మీకునేనుయేమీలేదు
అని । నిశ్చయమైందో । అలాగే । మూలంలేని । యీగుతేఁరిగే శరీరం ।

—( బయలు లక్షణం )—

పుట్టనిచావనిది । మొదలు కొనాలేనిది । వాక్కైనా క్రియాలేనిది । శరీరం । లేనిది । సకలదేశాలయందు । చలించ్చక । సార్వకాలం । వాక్కుతీరుగా । వున్నది । సూచన కాంగ్గానే । మొదలుకొనా యేమీలేదు ।

—( యెరుక లక్షణం )—

కొనకుయేమీలేనిది । మధ్య కాశేపువుండి । మేలుకొంటె యేమీలేనట్టు । మూలంలేని యీగుర్తరిగే శరీరం ఆలాగువుంచ్చుంది ।

* గద్య *

ఇతి * శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే

వేదాంత విచారణే.

—( సదానంద యోగిశతకము. )—

సీ॥ మతములెన్నైగలవు భూమండలమున * మతములన్నియుదలపగా మాయసువ్వె
మతమువిడిచిన మదికిసమ్మతముగాదె * నవ్యతరభోగి శ్రీసదానందయోగీ ॥

గీ॥ ద్వైతమనుచును కొందరద్వైతమనుచు * కవితయుందలి తత్వముల్ గణనజేసి ।
వాదమొనరింతు రెరుగనివారుభువిని * నవ్యతరభో శ్రీసదానందయోగీ ॥

గీ॥ తత్వమిదియని తెలిసియే జనులతోడ * చెలగిపలుమారు వాదముల్ శేయబోక ।
మౌనవృత్తిచరించుట మంచిమతము * నవ్యతరభోగి శ్రీసదానందయోగీ ॥

—( గురుగీతా. )—

శ్లో॥ శైవశాక్తాగమాదీని ! హ్యన్యేచబహవోమతాః ।
అపభ్రంశాస్సమస్తానాం ! జీవనాంభ్రాంతచేతసం ॥

## ౮ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత పత్రికాశిక

—(తత్వము)—

పల్లవి.

నగబుద్ధాచుందీ। ప్రజలా నడతజూచి యిహింహిహింయని।

అనుపల్లవి.

జగతిలో కల్లే నిజమాయా। సత్యంబన పేరుద్ధమాయా।
దిగువాజూచేవారేకాని। యగువాజూడా రో హాహా హాహా। నగ।

చరణములు.

చదివి వేదాశాస్త్రములన్ని। సర్వంమే మెరుగుదుమనితమలో॥
హృదయాకమలా మందూశివుడు। వున్నాదెరుగ రో హాహా హాహా॥ నగ॥
తిరుమాణి తిరిచూర్ణ-మనుదుట తీర్చి శ్రీవైష్ణవులామనుచు।
తిరువారాధనచేస్తువిష్ణు దేవుంన్నెరుగా రో హాహా హాహా॥ నగ॥
వ్యాపాలూ-మధ్వలుముద్రిలతో। గోపీచందనమూధరియించి।
గోపాలకృష్ణుడుతమలో వెలిగే। గోప్యామెరుగా రో హాహా హాహా॥ నగ।
లింగాలుమెడలోధరియించి। పొంగూచుశీలవ్రతములనడిచే।
జంగమమూర్తులమనుచుతమలో। లింగాన్నెరుగా రో హాహా హాహా॥ నగ।
తలబోడై భుజములుగాల్పించుక। తులశీపూసలు తిరుమణిచూర్ణం।
చెలరేగీధరియించి శేషా। చలపతినెరుగా రో హాహా హాహా॥ నగ।
అవనీమీదాపశ్చిమముఖులై। అల్లాఖూదాయంచ్చుజాల।
యవనులుచాలుమూసుకలోను। జ్ఞానునెరుగారో హాహాహాహా॥నగ॥
సత్వగుణంబునుపొందనిదుర్జన। సంగతిచాతనుదురహంకారులై।
తత్వవేత్తలను తెలియకశుద్ధాతామసులై। చెడిపోయి రో హాహాహాహా।
యన్నెన్నోజన్మాముల్లెత్తి। యన్నటికిదరిగానలేకా।
కన్నాయోనులయందుబుట్టి గతికోర్పుకున్నారో హాహాహాహా।
యుక్తాయుక్తము తెలియక కామా। సక్తిచాతనుభ్రమశిశ్రీగురు!
భక్తిలేకాభవానిశంకర! భావంబెరు గారో హాహాహా॥

## —( తత్త్వము )—

పల్లవి.

యెంతవారలైతేనేమీ | యీసోమయాజు | లెంతవారలైతేనేమీ

అనుపల్లవి.

యెంతవారలైతేనేమి | దొంతిమీదనున్న చిన్ని
ముంతలోనె యంతరాత్మ | కంతదెలియ లేనివారు ॥ యెంత ॥

చరణములు.

ఆహితాగ్నులైతేనేమీ | అవభృథస్నానమనుచు | అగ్నిదీక్ష బూనియేమీ
సాహసమున గూటిమీద | సోహమనెటిబుద్ధిపుట్టి | స్వాహాకములణంచు
రాజగురునిజార లేనివారు ॥ యెంత ॥
కాశియాత్రబోతేనేమీ | రామేశ్వరమున | గంగధారబోసియేమీ
నాశికాగ్రమందునన్న | పూసబొంకు కొంకునున్న | సూసలేరుదాటలేని
వేషధారులైనవారు ॥ యెంత ॥
వడఖనంబిఅయితేనేమీ | తిరుమంగయా | ళ్వారి సేవజేసియేమీ
అడియడనుచు దాశియనుచు | నుడివెనుడు పురహితమైన
కడకుతనకుదొరుకుటేదో | దానితెలియలేనివారు ॥ యెంత ॥
లింగధారులైతేనేమీ | లింగాన్ని మ్రింగి | కొంగజపముజేశియేమీ
సంగరహితమైనబయలు | సంగతెరిగి తనదుహృదయ
లింగమేదో లింగదేహ | భంగమరయలేనివారు ॥ యెంత ॥
యెతులమనుచుదిరిగియేమీ | చుట్టాలసుతుల | హితులబాసియుంటెనేమీ
మతములెన్నో తమకుతమకు | హితవుగల్గినట్టుల శాస్త్ర
మితములనుచు చర్చజేసి | గతులుగానలేనివారు ॥ యెంత ॥
అందరానిఫలములెందుకూ | యీశాస్త్రబోధ | లందుముందుజన్మమెందుకూ
క్రిందిజన్మమెరుగలేక | ముందుజన్మఫలితవ్యథల | పొందకుంటెదెందుకూరి
ఇందుధరునిజారలేని ॥ యెంత ॥

## ౧౦ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

—( కందార్థము )—

౧౦౭ * ద్వైతాద్వైతవిశిష్టులు * నైతురువిని నైసరెపుడు * నైసకపిదప నైతురుక్రిమమునవేరన * నాతతమతిజీవశివుల * నవివినబోకూ * నేబోధించి నదివిడబోకూ * పూతావహాబయలూను పొడజూచిగురునీచె * ద్వైతాద్వైతవిశిష్ట ద్వైతాఃములనుమాను * మవివినబోకూ * నేబోధించి * నదివిడబోకూ ॥ ౨ ॥

కం॥ ద్వైతాద్వైతవిశిష్టా * ద్వైతులమునికీచులాడు * దయ్యాములవలెన్ ।
ద్వైతాద్వైతవిశిష్టా * ద్వైతులతోకీచులాడ * దగునేనీకున్ ॥

—(*) సదానందయోగిశతకము (*)—

గీ॥ శివుడుజీవుడురెండు వస్తువలటంచు । నిట్లునెంచినసాయుజ్య మెట్లగలుగు ।
జీవశివభేదమెన్నడు సేయరాదు । నవ్యతరభోగి శ్రీసదానందయోగీ ॥

గీ॥ సత్తునెరుగదసత్తు దాజడముగాన । సత్తుసత్తునెరుంగ బ్రిశక్తిలేదు ।
యట్టిదాసత్తునెరిగిన యాత్మసువ్వె । నవ్యతరభోగి శ్రీసదానందయోగీ ॥

గీ॥ నీటగలశినలవణంబు నీరెకాని । నీరుగాకుండ దారీతినిశ్చయముగ ।
శివునిగలశినజీవుండు శివుడుసువ్వె । నవ్యతరభోగి శ్రీసదానందయోగీ ॥

గీ॥ సూర్యకిరణాగ్నికిరణముల్ జూచుకంటె । శాశ్వతంబును నదియెపో శాశ్వతంబు
జీవుడటజీవుడనగను శివుడుసువ్వె । నవ్యతరభోగి శ్రీసదానందయోగీ ॥

* సిద్ధసిద్ధాంతపద్ధతౌ *

( అథావధూతలక్షణం )

అవధూతయోగీనామకః । ఇత్యపేక్షాయామాహ । యః సర్వాన్ప్రకృతి వికారాన్ । అవధునోత్యవధూతయోగీ । యోగోస్యాస్తీతియోగీ । ధూం.ఉం కంపనె । ధుం. ఇతి. ధాతుః । కంపనేర్థేవర్తతే । కంపనంచాలనం దేహా

దేహికాప్రపంచాదిషు. విషయేషుసంగతంమనః. పరిగృహ్యతేభ్యః ప్రత్యా వృత్యస్వధామమహిమ్ని పరిలీనచేతాః. ప్రపంచశూన్యః । ఆదిమధ్యాంతని ధనభేదవర్జితః ॥

శ్లో॥ యకారోవాయుబీజంస్యా । ద్రికారంవహ్నిబీజకం ।
తయోరభేదఓంకారః । చిదీకారప్రకీర్తితః । తదేవతద్వ్య క్తముచ్యతే ॥

శ్లో॥ క్లేశపాశతరంగాణాం । కృంతనేనవిముండనం ।
సర్వావస్థావినిర్ముక్తః । సోవధూతోభిధియ్యతే ॥

శ్లో॥ నిజస్ఫారవిభూతిర్యో । యోగస్యాంగేవిభూషితః ।
ఆధారీయస్యచారూఢీ । సోవధూతోభిధియ్యతే ॥

శ్లో॥ లోకమధ్యేస్థిరాసీనః । సమస్తకలనాంకితః ।
కౌపీనంకర్పరాస్థానం । సోవధూతోభిధియ్యతే ॥

శ్లో॥ శంసుఖంతంపరంబ్రహ్మ । శంఖసంఘట్టణాద్భవేత్ ।
సిద్ధతద్ధారితంయేన । సోవధూతోభిధీయ్యతే ॥

శ్లో॥ పాదుకాపరసంవిత్తి । మృగత్వచమనాహతం ।
చెలాయస్యపరాసంవి । తోవధూతోభిధియ్యతే ॥

శ్లో॥ మేఖలావిరతినిత్యం । స్వస్వరూపంకటాసనం ।
నివృత్తిష్షడ్వికారస్య । సోవధూతోభిధియ్యతే ॥

శ్లో॥ చిత్ప్రకాశపరానందో । యస్యవైకుండలద్వయం ।
జపమాలాక్షవిశ్రాంతి । సోవధూతోభిధియ్యతే ॥

శ్లో॥ యస్యధైర్యమయోదండః । పరాకాశంచఖర్పరం ।
యోగపట్టనిజాశక్తిః । సోవధూతోభిధియ్యతే ॥

## ౧౨ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్త్వ కందార్థానేక సదృష్టాంత పరికాశిక.

శ్లో॥ భేదాభేదాన్వయంభిన్నాం । కృత్వాస్వాస్వాస్వ నేరతః ।
జారణాత్తన్మయీభావః । సోవధూతోభిధీయతే ॥

శ్లో॥ అచింత్యేనిజదిగ్దేశే । స్వాంతరంయస్తుగచ్ఛతి ।
ఏవందేశాంతరీయోయః । సోవధూతోభిధీయతే ॥

శ్లో॥ స్వపిండమమరంకర్తుం । అనంతామమరీంచయః ।
స్వయమేవపిబేదేత్రితా । తోస్వవధూతోభిధీయతే ॥

శ్లో॥ ఆదిన్యావజ్రవద్గాఢా । వాసనామలసంకుల ।
సావజ్రీబక్షితాయేన । సోవధూతోభిధీయతే ॥

శ్లో॥ ఆవర్తయతియఃసమ్య । క్స్వస్వమధ్యేస్వయంసదా ।
సమత్వేనజగద్వేత్తి । సోవదూతోభిధీయతే ॥

శ్లో॥ స్వాత్మానమవగచ్ఛేద్య । త్స్వాత్మన్యేవావశిష్యతే ।
అనుద్ధానమయఃసమ్య । క్సోవధూతోభిధీయతే ॥

శ్లో॥ అనుద్ధాధారసంపన్నః । పరవిశ్రాంతిపారగః ।
ధృతచిన్మయతత్త్వజ్ఞః । సోవధూతోభిధీయతే ॥

శ్లో॥ అవ్యక్తంవ్యక్తమాధత్తే । వ్యక్తంసర్వంగ్రసత్యలం ।
స్వసత్యంస్వాంతరేసన్నం । సోవధూతోభిధీయతే ॥

శ్లో॥ అవభాసాత్మకోభాసః । స్వపరికాశేసుసంస్థితః ।
లీలయారమతేలోకే । సోవధూతోభిధీయతే ॥

ఏవంవిధనానా సంకేతసూచక । నిత్యప్రముఖో నిజస్వరూపీ సర్వేషాం । సిద్ధాంతదర్శనానాం । స్వస్వరూపదర్శనే సమ్యక్ సద్వైధకోఅవధూత యోగీత్యభిధీయతే । సద్గురుభర్ణవతి । యతః సర్వదర్శనానాం స్వస్వ రూపేసమన్వయం కరోతి సోవధూతయోగీస్యాత్.

శ్లో॥ అత్యాశ్రమీచయోగీచ। జ్ఞానిసిద్ధశ్చసువ్రతః।
ఈశ్వరశ్చతథాస్వామీ। ధన్యశ్రీసాధురేవచ॥

శ్లో॥ జితేంద్రియశ్చ భగవాన్। సత్సంధికోవిదోబుధః।
చార్వాకశ్చాహగ్ఁతశ్చేతి। తథాబాద్ధప్రకాశంవిత్।
తార్కికాశ్చేతిసాంఖ్యాశ్చ। తథామీమాంసకస్తథా।
దేవదత్తాదివిద్వద్భిః। కీర్తితః శాస్త్రకోటిషు॥

తత్రిబ్రాంహ్మణేషు। బ్రహ్మచర్యాశ్రమమాహ

—( బ్రహ్మచారిలక్షణం )—

శ్లో॥ సర్వతోభరితాకారం। నిజబోధేనబృంహితం।
చరతేబ్రహ్మవిద్యాస్తు। బ్రహ్మచారీసకథ్యతే॥

—( గృహస్థలక్షణం )—

శ్లో॥ గృహిణీపూర్ణతానిత్యా। గేహంవ్యోమసదాచలం।
యస్తయానిసత్యత్రి। గృహస్థసోభిధియ్యతే॥

—( వానప్రస్థలక్షణం )—

శ్లో॥ యోనసదాంతఃప్రస్థితోయం। స్వప్రకాశమయేవనే।
వానప్రస్థఃసవిజ్ఞేయో। నవనేమృగవచ్చరన్॥

—( సన్యాసి లక్షణం )—

శ్లో॥ పరమాత్మాసజీవత్వ। మాత్మన్యేవస్ఫురత్యలం।
తస్మిన్యస్తేసదాయేన। సన్యాశీసోభిధియ్యతే॥

—( త్రిదండ సన్యాశి లక్షణం )—

శ్లో॥ మాయాకర్మకళాజాల। మనిశంయేనదండితం।
అచలోనగవద్భాతి। త్రిదండీసోభిధియ్యతే॥

## ౧౮ శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత ప్రకాశిక.

—( ఏకదండ సన్యాసి లక్షణం )—

శ్లో॥ ఏతన్నానావిధాకారం । చంచలంచసదాచలం ।
తచ్చిత్తందండితంయేన । ఏకదండీసకథ్యతే ॥

—( శైవుల లక్షణం )—

శ్లో॥ శుద్ధంశాంతంనిరాకారం । పరానందసదోదితం ।
తంశివయోవిజానియ్యా । చ్ఛుద్ధశైవోభవేత్తుసః॥

—( తాపసుల లక్షణం )—

శ్లో॥ సంతాపయతితత్తాని । ఇంద్రియాణిచయఃసదా ।
తాపసఃసతువిజ్ఞెయో । నతుగోభస్మదారకః ॥

...[ పాశుపత లక్షణం ]...

శ్లో॥ క్రియాజాలంపశుంమత్వా । పాతిత్వంపూర్ణతాంగతం ।
యత్తిష్ఠత్యతిభావేనం । సవై పాశుపతోభవేత్ ॥

—( కాలముఖుల లక్షణం )—

శ్లో॥ పరానందమయంలింగం । నిజపీఠేసదాచలే ।
తల్లింగంపూజితంయేన । సవై కాలముఖోభవేత్ ॥

—( లింగధార్క లక్షణం )—

శ్లో॥ విలయంసర్వతత్వానాం । కృత్వాసందాయతేస్థిరం ।
సర్వదాయేనవీకేణ । లింగధారీభవేత్తుసః ॥

—( నిర్వాణపదుల లక్షణం )—

శ్లో॥ అంతకాదీనితత్త్వాని । త్యక్త్వానగ్నోదిగంబరః ।
యోనిర్వాణపదేలీనః । సనిర్వాణపదోభవేత్ ॥

—( కాపాలికుల లక్షణం )—

శ్లో॥ స్వస్వరూపాత్మకంజ్ఞానం । సమంత్రంతత్రపాలితం ।
అనన్యత్వంసదాయేన । సవైకాపాలికోభవేత్ ॥

—( వ్రతధారి లక్షణం )—

శ్లో॥ మహావ్యాప్తైవరంతత్త్వ । మాందాంగాధేయవర్జితం ।
తద్వ్రతంధారితంయేన । సభవేద్వైమహావ్రతి॥

—( శక్తిభాక్కు లక్షణం )—

శ్లో॥ కులంసర్వాత్మకంపింతం [?] । అకులంసర్వతోముఖం ।
తయోరైక్యపదంశక్తి । ర్యస్తంవెదస్సవేదభాక్ ॥

—( శక్తిజ్ఞాని లక్షణం )—

శ్లో॥ కాలంసర్వకళాగ్రాస । స్సకృత్యస్సతతంయయా ।
తాంశక్తింయోవిజానాతి । శక్తిజ్ఞానీసకథ్యతే ॥

శ్లో॥ జ్ఞాత్వాకులాకులంతత్త్వం । సం[illegible]క్రమేణతు ।
స్వప్రకాశమహాశక్త్యా । తతస్తత్త్వ

శ్లో॥ మదోమద్యంమతిర్ముద్రా । మాయామీ.
మూర్ఛనంమైథునంయస్య । తేనాసౌశాక్తఉ

శ్లో॥ యామాభాసస్ఫురద్రూపం । కృతంచైవస్ఫుటంబట
తాంశక్తింయోవిజానాతి । శాక్తఃసోత్రోభిధీయతే ॥

శ్లో॥ యఃకరోతినిరుద్ధానం। కర్తుచిత్రస్యసర్వదా।
తద్విశ్రాంతితయాభక్తా। శాక్తఃసోత్రాభిధీయతే॥

—( వైష్ణవుల లక్షణం )—

శ్లో॥ వ్యాపకత్వేపరంసారం। యద్విష్ణోరాద్యమవ్యయం।
విశ్రాంతిదాయకందేహా। తద్జ్ఞానాద్వైష్ణవోభవేత్॥

—( భాగవతుని లక్షణం )—

శ్లో॥ భాసస్వరూపోయోభేదా। ద్భేదాభేదభయోజ్ఝితః।
భాతిదేహేసదాయస్య। సవైభాగవతోభవేత్॥

—( భేదవాది లక్షణం )—

శ్లో॥ యోవేత్తివైష్ణవంభేదం। సర్వాసర్వమయంని[illegible]
ప్రబుద్ధంసర్వదేహస్థం। భేదవాదీభవేత్తుసః॥

—[ పాంచరాత్రుల లక్షణం ]—

శ్లో॥ పంచానామక్షపాతానాం। పంచత్వంరాత్రిరుచ్యతే।
తాంరాత్రింయోవిజానాతి। సభవేత్పాంచరాత్రికః॥

—[ స[illegible] లక్షణం ]—

యాంతిచతత్స[illegible] జ్ఞాత్
జీవిసఉచ్యతే॥

[సాత్వికుని లక్షణం]

[illegible]ప్రీతిం। ప్రసన్నైపురుషేపరే।
[illegible]ంద్రియాణ్యేవ। సాత్వికఃసోభిధీయతే॥

—♦ సూక్ష్మసాత్వికుని లక్షణం ♦—

శ్లో॥ సర్వాకారంనిరాకారం । నిర్ణీతేతంనిరంజనం ।
సూక్ష్మహంసంచయోవేత్తి । సభవేత్సూక్ష్మసాత్వికః ॥

—* సత్యవాది లక్షణం *—

శ్లో॥ సత్యమేకమజంనిత్య । మనంతంచాక్షరంధృవం ।
జ్ఞాత్వాయస్తువదేద్ధీరః । సత్యవాదీసకథ్యతే ॥

—♦ కళంకీ లక్షణం ♦—

శ్లో॥ జ్ఞానజ్ఞేయమయాభ్యాంతు । యోగినఃస్వస్వభావకః ।
కంళంకీసతువిజ్ఞేయో । వ్యాపకఃపూరుషోత్తమః ॥

జ్ఞాని లక్షణం.

శ్లో॥ ముక్తిచారేమతిర్యావై । ప్రాపికాసంప్రకాశికా ।
యేషాజ్ఞాతృవతీయేన । జ్ఞాతాసాసాత్వికోభవేత్ ॥

—♦ క్షపణిక లక్షణం ♦—

శ్లో॥ క్షపణంచిత్తవృత్తీనాం । రాగద్వేషవిలుంఛనం ।
రురుతేవ్యోమవన్నగ్నో । యోసాక్షపణకోభవేత్ ॥

—♦ సిద్ధయోగి లక్షణం ♦—

శ్లో॥ ప్రసరంభాసతేశక్తిః । సంకోచంభాసతేశివః ।
తయోఃసంయోగకర్తాయః । సభవేత్సిద్ధయోగిరాట్ ॥

శ్లో॥ విశ్వాతీతంయథావిశ్వ ! మేకమేవంవిరాజితే।
సంయోగేనసదాయస్తు । సిద్ధయోగీభవేత్తుసః ॥

## ౧౮. శక్తిద్వయ నిర్ణాసకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థానేక సదృష్టాంత పత్రికాశిక.

శ్లో॥ సర్వాసాంనిజవృత్తీనాం । పరివృత్తింభజతేతుయః ।
సభవేత్సిద్ధసిద్ధాంతే । సిద్ధయోగీమహాబలః ॥

శ్లో॥ ఉదాసీనఃసదాశాంతః । స్వస్థోతన్నిజభాసకః ।
మహానందమయోధీరః । సభవేత్సిద్ధయోగిరాట్ ॥

శ్లో॥ గతేనశోకంవిభవేనవాంఛా । ప్రాప్తేనహర్షంనకరోతియోగీ ।
ఆనందపూర్ణోహ్యచితబోధలీనో । నబాధ్యతేకాలపథేననిత్యం ॥

### ( శ్రీగిరీశశతకము. )

సీ॥ బ్రహ్మాండములుమున్నె ప్రవణంబుదామున్నె ♦ నాదబిందులుమున్నె నవనిమున్నె
ఆకారములుమున్నె ఆదిమంత్రిముమున్నె ♦ ఘననిరాకారుడా కర్తమున్నె ।
దివ్యతేజముమున్నె తిమిరంబుదామున్నె ♦ జగదీశ్వరుడుమున్నె శక్తిమున్నె ।
దైవభేదముశేయు ధరమానవులుమున్నె ♦ తివిరిదీనర్థంబు దెలియకున్న ।

గీ॥ దనుచుతమతమువారిని యడగవలయు * అభవమొలుగూరి
యద్రిపైయలరినట్టి శ్రీనిరంజన విశ్వేశ * శ్రీగిరీశా ॥

సీ॥ ఆమహాప్రవణంబు ఆడిదోమొగవాడో ♦ శివభక్తిపరులార చెప్పరయ్య ।
అమితపరంజ్యోతి ఆడిదోమొగవాడో ♦ శ్రీవైష్ణవుల్లార చెప్పరయ్య ।
ఆనిరాకారంబు ఆడిదోమొగవాడో ♦ జగతివైద్విజులార చెప్పరయ్య ।
ఆకళాతీతంబు ఆడిదోమొగవాడో ♦ శాక్తియ్యపరులార చెప్పరయ్య ॥

గీ॥ అగ్రహించకచెప్పరే యనఘులార * అనుచుమతభేదకులు యిట్లుఆడితేను ।
అభవ మొలుగూరి యద్రిపైయలరినట్టి * శ్రీనిరంజనవిశ్వేశ శ్రీగిరీశా ॥

సీ॥ సివుడుమావాడనే శివభక్తజనులార ♦ ఆదికాలమున కూడ్యాడినార |
విష్ణుమాడనే వైష్ణవోత్తములార ♦ పెరుగుపాలునుబోశి పెంచినార |
బ్రహ్మమావాడనే బ్రాహ్మణోత్తములార ♦ చదువుశాస్త్రముజెప్పి సాదినార
శక్తిమాదనియెటి శాక్తియ్యపరులార ♦ ఝుంచుకైనను ఆదరించినార ॥

గీ॥ యిట్లుమీారన శిగ్గయ్యేశింతెనాకు * మాయదెలియగ లేనట్టిమాటలన్ని |
ఆభవమొలుగూరి యద్రిపైయురినట్టి * శ్రీనిరంజనవిశ్వేశ శ్రీగిరీశా ॥

—( కందార్థము )—

(౧౦౮) * కొందరుదశవిధనాదము * లందుననభపంచకంబు * నందునచక్రా
లందునలక్ష్యధానం * బ్బందునహంసంమబుద్ధి * నాటింతురోయీా * యోగములందు
నటియింతురోయీా * అందీసిద్ధులచాత * నానందింతురుకొంద * రందారిమనుసీబో
ధందేనీవుండుము * నాటింతురోయీా * యోగములందు * నటియింతురోయీా ॥

క॥ అష్టాంగయోగములనతి | కష్టించేప్రజలవలెనె | కష్టించకయీా |
స్పష్టమగుబోధవినుసీ | కష్టములన్నియునుదొలగి | కడకేగుజుమీా ॥

క॥ కొందరుభక్తిత్రయమున | కొందరుయోగములయందు | కొందరుజ్ఞానం |
బందురమింత్రురువారల | కందరికీబోధయిష్ట | తొనానాయనా ॥

సీతారామాంజనేయ సంవాదము.

( దశవిధ. నాద. వివరణము. )

గీ॥ సద్గురుప్రోక్తముద్రచేశ్రవణయుగము | మూసియాలింపబ్రణవంబుమ్రోయు
మొదల |
జిణియనుచునంతటను జిణీజిణీయటంచు| మంచిరెండవమారు ఘూషించుననఘా ॥

వ॥ ఇట్లు చిణీనాదంబు చిణిచిణీనాదంబు ఘంటానాదంబు శంఖనాదంబు వీణానా

దంబు తాళనాదంబు వేణునాదంబు భేరీనాదంబు మృదంగనాదంబు మేఘనాదం బనంబరగు దశవిధ ప్రణవనాదంబుల శ్రీగురూపదేశ పూర్వకంబుగా శృతియు క్త్యనుభవంబులచేత నెఱుంగ వలయు మరియును.

### నాదబిందుకళలు.

గీ॥ భూరినాదంబ కారంబుపుణ్యపురుష। విమలబిందువుల నదుకారముగ ద్రీంద్రి॥
కళమకారమీమూడును గలియగూర్ప। ఘనతరోంకారమగు సదాగతికుమార॥

ఆ॥ కనులురెండుగురుని యనుమతిగొనిమూసి। బొమలనడిమిద్విదళ కమలమునను।
విమలదృష్టినిలిపి శమలలితాత్ముడై। చూడవలయు లక్ష్యశోభనముల॥

### ఆకాశపంచక స్వరూపము.

వ॥ ఇట్లు తన లోచనంబులకు గనుచూపుమేర గోచరంబైన హృదయాకాశంబునం దు గేవల నిరాకారంబైన గుణరహితాకాశంబు నిబిడ నిష్ఠుర నీరంధ్ర గాఢాం ధకారంబైన పరాకాశంబు ప్రళయకాల ప్రజ్వలాభీల దావానలాకారంబైన మ హాకాశంబు వివిధ విచిత్ర వితతాపరిమిత ద్యుతి భరితంబైన తత్వాకాశంబు ప్ర చండ మార్తాండ మండల శతకోటి ప్రభాభాసురంబైన సూర్యాకాశంబు నను పంచాకాశంబుల నవలోకింపవలయు మరియును.

ఆ॥ అంజనేయా విను తదాకాశ పంచక। మధ్యమమున వెలుగు మహితకళల
చందమెల్ల నీకు ముందుగా వినిపింతు। సందియములు మాని పొందువాని॥

### అష్టైశ్వర్యముల వివరణము.

సీ॥ అణుజంతువులయందు నణువై చరించుట లణిమాహ్వయైశ్వర్య మలఘుచరిత,
యబ్జజాండాదిమ హన్మహుండై యుంట గరిమాఖ్యభూతి నిర్మలవిచార,
బ్రహ్మాండమునకంటె భారమైయుండుట గరిమాఖ్యసంపత్తి కలుషదూర
యమరాద్రి సదృశుండై యతిసూక్ష్మగతినుంట లఘిమావిభూతి సల్లలితహృదయ